శ్రీ

# ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలము

[మహాకవి శ్రీ కాళిదాసకృతికి అనువాదము]

'మహోపాధ్యాయ'

దుర్భా సుబ్రహ్మణ్య శర్మ

నెల్లూరు.



1955



[వెల - రెండురూపాయలు

శ్రీ

# ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము

[మహాకవి శ్రీ కాళిదాసకృతికి అనువాదము]



'మహోపాధ్యాయ'
దుర్భా సుబ్రహ్మణ్య శర్మ
నెల్లూరు.

1955

 [వెల–రెండురూపాయలు

మ॥ పదమొక్కండును మార్పరాని యటు చేర్పన్ రాని యౌచిత్యపుం
జదు రొప్పారెడు కాళిదాసకృతి యీ నాట్యప్రబంధంబు, దీ
నిఁ దెలింగింపఁదరంబె యెట్టి వారయున్ లేకుండ, దోషజ్ఞు లి
య్యది పాటించి గ్రహింతురుగాక గుణలేశాంశంబ యస్మత్కృతిన్.

Kokila Press, Nellore.

# అంకితము

---:0:---

సీ. నాపుట్టినట్టి యింటనె పుట్టి మాసత్ర
యమ్మ నాకన్నఁ జిన్నదియ యగుచు,
నాతోడఁ బెరిఁగి మేనత్తకానఁ జేసి పం
డ్రెండవయేట నన్ బెండ్లియాడి,
అఱువదియేండ్లు నన్నభిరతిఁ గొల్చి పు
త్త్రిని బుత్త్రకుని గాంచి హృదిని దనిసి,
నాతత్త్వపరత విఘ్నము పాలుగాకుండ
గృహకార్యభరము తానే వహించి
ఆ. ఎనిమిదేండ్లనాఁడు* ననుఁ బాసిచనిన య
ర్ధాంగికిని సనామయైన సాధ్వి
కమృతసిద్ధిఁ గోరి యంకిత మ్మొనరింతు,
ప్రీతిపూర్వకముగఁ గృతిని దీని.

ఉ. తల్లికిఁ గాక మేలికృతిఁ దన్వికి నర్పణచేసె నంచు న
న్నెల్లసమాడఁ బోకుఁడు, మఱొండుకృతిన్ 'పరమేశతత్త్వమున్'
దెల్లము చేయుదాని పరదేవత కిచ్చితి మత్పవిత్రికిన్,
జల్లని యామెయుల్లము పశంసదపూటఁ దదంశ చింతకున్.

మ. ఇది శృంగారరసప్రబంధ మగుటన్ హృద్యాచితిన్ దీని మ
త్సతీరత్నము క్రాలుగన్నులకు నెంతోరక్తి నంకించితిన్;
త్రిదివంబందో తతోధిక స్థలినో సాధ్వీస్థాన మూహించియున్
ద దసాన్నిధ్యము లోనఁబాఱి మది వంతంగూరు నీనాఁటికిన్.

---

* 13—2—1948

# విజ్ఞప్తి

నేను శ్రీ నెల్లూరు ఆంధ్రసభకు ముప్పదేండ్లకుఁ బైఁగా అవిచ్ఛిన్నముగా ఉపాధ్యక్షుఁడనుగా నున్నాను. తొలి పది పదిరెండు సంవత్సరములలో ఆ సభకు ఏకొలఁదిపాటి పరిచర్య కావించితినో యేమో కాని, ఇటీవల సభవారు కూర్చు నాధ్యాత్మిక సారస్వతాది సమావేశములలో ఉపన్యసించుటయో, అధ్యక్షించుటయో తక్క నింత కథికముగా నేను సభకార్యములకుఁ దోడ్పడియుండలేను. అట్లయ్యు, వారు నాయెడ నిచ్చలు నపూర్వగౌరవము నెఱపుచు, మొన్నటి విజయసంతోత్సవములలో నా పేర నొక గ్రంథాలయము నెలకొల్పఁ దీర్మానించి, నెలకొల్పి తదభివృద్ధికొఱకు నిరంతర పరిశ్రమము కావించుచున్నారు. సభవారి యీ యౌదార్యమునకు నేను జేయఁ గల ప్రత్యుపకృతి యెయ్యది? 'విద్వాంస్తుష్టః శ్లోకమేకం దదాతి' అని కదా యభియుక్తోక్తి. అంత మన్ననకును ఇంతయేనా మాఱుసేఁత! అట్టి యభినందనములు సభవారు ఎందఱు మాననీయుల చేతనో యీ వఱకే పలుమాఱు పొందియున్నారు. అని బహువారము తలపోసి వారు మిక్కిలి ప్రియపడి నా చేతనే తెలిఁగింపించిన యీ 'యభిజ్ఞాన శాకుంతలము' యొక్క ప్రయోగాధికారము అనన్యముగా వారి కధీనము సేఁత యొక విధమైన ప్రత్యుపకృతిగాను చిరస్మృతివిషయము గాను ఉండునని భావించి యీ విజ్ఞప్తిమూలమున ఆస్వత్వము వారికి సంక్రమింపఁ జేయుచున్నాను. ఇది యలంతియప్పనమే యైనను, ఇప్పటి నాచాలమిం బట్టి దీనినే వారు ఒప్పరికింపక గొప్పగా గ్రహింతురని నన్ను నేను సమాశ్వసించుకొనుచున్నాను. ఇతరస్వత్తులేని, సంస్థలేని దీనిం బ్రయోగింపఁ దలంతురేని వారు నాకేని ఆంధ్రసభవారికేని వ్రాసికొని వారు ఏర్పఱుచు నియమములకులోఁబడి ప్రయోగాధికారము పడయవలయునని యిందుమూలమునఁ బ్రకటించుచున్నాను. ఇట్లు శ్రీ ఆంధ్రసభకును విశేషించి దానికిఁ బ్రాణనాడి యని పేర్కొనఁ

దగిన మద్బంధుప్రవరులు, 'అమృతకలశ' 'వివేకానందా'ది కృతిభర్తలు శ్రీయుతులు చిరంజీవి పులిగెండ్ల వేంకటకృష్ణయ్య, బి. యే., బి.యల్. గారికిని నేనుపడియున్న యప్పు కొంతకుఁగొంత తీర్చుకొనుచున్నాఁడను. వారి బలాత్కారమును, బంధుర సహకారమును లేకున్న ఈ గ్రంథమునకు ముద్రణభాగ్యము లభించియుండెడిది కాదు. భగవంతుఁడు శ్రీ వేంకటకృష్ణయ్యగారికిని, వారికిఁ దోడ్పడిన తక్కు మిత్రములకును, ఆయురైశ్వర్యాది సకల సమృద్ధులు గలిగించుఁ గావుతమని ప్రార్థించుచున్నాను.

నెల్లూరు,
4-8-1955

దుర్భా సుబ్రహ్మణ్య శర్మ.

# అవతరణిక

కలాశాలలో నేను పండితపదవి నధిష్ఠించియున్న కాలమున ఆంధ్రభాష నైచ్ఛికశాఖగాఁ గొన్న - విద్యార్థులకు 1924 సంవత్సరమున శ్రీ కందుకూరు వీరేశలింగముపంతులువారి తెనుఁగు శాకుంతలము పాఠము చెప్పవలసినవాఁడ నైతిని. ఆ తెనిఁగింపునందలి ప్రసాదమాధురిమములకు అత్యంత సంతుష్టుఁడనై, నేనును గొన్ని శ్లోకములు యథామూలము తెనిఁగింతునుగాక యని వినోదముగా సంకల్పించితిని. విద్యార్థులు ఇది యెఱింగి కొన్ని పద్యములు నావి తమ పాఠ్యపుస్తకములలో వ్రాసికొని కడమవియు వ్రాయుఁడని నన్ను ప్రేరించుచుండిరి. ఈమేరకు ఆ వత్సరము ఒక నెలలో 60 పద్యములు, వేఱొక నెలలో 32 పద్యములు మొత్తము 92 వ్రాసితిని. ఆ పాఠ్యము పూర్తియగుడు, విద్యార్థులును నేనును ఇతరపాఠములందు వ్యాపృతులమై దీని సంగతియే విస్మరించితిమి. కావున ఆ రచన అంతటితో నాఁగిపోయెను. ఆ పద్యరచన పూర్తి సేయవలయునని కాని, శాకుంతలమంతయుఁ దెనిఁగింపవలయునని కాని నాకుఁ దలంపే లేకుండెను.

నేను ఉపాధ్యక్షుఁడనుగా నున్న శ్రీ నెల్లూరు ఆంధ్రసభ (Regd)వారు శాకుంతలశేషము పూర్తిసేయుఁడని పలుమాఱు నన్ను హెచ్చరించుచుండిరి. కాని యుత్తమములైన యాంధ్రీకరణములు ఒండురెండు ఉపలబ్ధము లగుచుండఁగా మరల నా దొకటి యేలయని వారి కోర్కెదెస నే నుపేక్షకుఁడ నైతిని. 1950 మార్చి నెలలోఁ గాఁబోలు, మన్మిత్త్రుఁడు, బంధువు, కలాశాలలో నాయొద్దఁ దెనుఁగు చదివిన విద్యార్థులలో నన్యతముఁడు చి॥ శ్రీ నేలనూతల కృష్ణమూర్తి (M.A., B.L..)గారు కేదారనాథుని శాకుంతల సంక్షేపమును, ఆంగ్లమున నున్నదానిని నా పజ్జకుఁ గొనితెచ్చి దీని నైనఁ దెనిఁగించి యిండని నన్నడిగిరి. నేనును దొడఁగి కొంతదనుకఁ దెనిఁగించునంత కది పాశ్చాత్త్యుల కుపయోగపడునేమో కాని మన యాంధ్రరంగమున

కంత యాకర్షకముగా నుండదని నాకు స్ఫురించెను. కావునఁ దత్ప్రయత్నమును భగ్నప్రాయమే యయ్యెను. ఐనను దాని తెనిఁగింపు ఛాయలు కొన్ని యీ కృతిలో నట్లే నిలిచిపోయినవి.

శ్రీ నెల్లూరు ఆంధ్రసభవారు 'కలాప్రపూర్ణ' శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి శాకుంతలమును యథోచితము సంక్షేపించి ఒండు రెండు పర్యాయములు ప్రయోగించిరి. శ్రీవారి స్థలకాది విభాగమే నేనును పాటించి యునికిఁ దద్జ్ఞులు గ్రహింపఁగలరు. ఒకప్పుడు శ్రీ రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారును, తదసన్నిధానమున చి॥ శ్రీ కామరాజుగడ్డ శ్రీనివాసరావుగారును (ఈయనయుఁ గలాశాలలో నాయొద్దఁ దెనుఁగుఁ జదువుకొన్నవాఁడే) దుష్యంత భూమికల ధరించి రసజ్ఞుల మన్ననలకుఁ బాత్రులైరి. శాస్త్రులవారి శాకుంతలమునకు నావలన నర్థము చెప్పించుకొనుచు సుబ్రహ్మణ్యముగారు ఒకతూరి నా కతిపయపద్యములలో నొండు రెండు విని 'ఇది మీరు పూర్తిచేసియిచ్చిన ఆడవలయునన్న కౌతుకము మాకు అతిమాత్రముగా నున్న'దని నన్ను హెచ్చరికించిరి. కాని ఆ హెచ్చరికయు నన్ను ఔదాసీన్యనిద్రనుండి మేల్కొలుపనేర దయ్యెను.

ఇటీవల మన్మిత్రులు 'సాహిత్యరత్న' చి॥ శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు శాకుంతలము ప్రసన్నమధురముగ తెలిఁగించిరి. అది విన్నవారు కొందఱు నన్నుఁ గలసికొని మీరును మీ కృతిని పూర్తికావించిన వేఱొకటి వెదకికొనకుండ గురుశిష్యుల కృతులు రెండును సభకు ఉపాదేయములుగా నుండునని నన్ను నత్యర్థము త్వరపెట్టిరి. ఆ ముహూర్త మెట్టిదో కాని నేను వెనువెంటనే 1953 సం॥ జూలై తే 16 ది నాఁడు అనువాదోద్యమమునకు మేకొని కొఱవడియున్న సుమారు నూఱు శ్లోకములను ఆంధ్రీకరించుటయే గాక 1953 సం॥ ఆగష్టు తే 27 ది నాఁటికి ఐదంకముల వచనరచనయు పూర్తికావించితిని. గ్రంథము తుదిముట్టుట కనుచూపుమేరలో నుండెను. కాని, ఆనాఁటిరాత్రి ఆకస్మిక హృద్రోగమున కగ్గమనై వైద్యవతంసునిచే సకలోద్యమములనుండి ప్రతిషేధింపఁబడి యింటనే విశ్రమింపవలసినవాఁడ నైతిని. ఆరోగ్యము కొంత చక్కనగుడు,

దీనిని శప్టెంబరు తే 23 ది మరల నారంభించి యోపికయున్న నాఁడు యథాసత్త్వము ఇంచుకించుకయ వ్రాయుచు నేఁటికి పూర్తి చేసి చరితార్థుఁడ నైతిని.

శాకుంతలము మనదేశముననేగాక, యన్యదేశములందును అత్యంత ప్రసిద్ధిగన్న నాటకము. నాగరికభాషలు అన్నియు దీని ననువదించుకొని యున్నవి. దీనికి టీకలు వ్యాఖ్యానములు దీనిపై వస్త్వాదివిమర్శలు అసంఖ్యములు కలవు. పాఠభేదములును అనేకములు. ఒక్కొక్క యనువక్త తన సంస్కారముకొలఁది యొక్కొక్క టీకనో అందలి పాఠమునో ప్రమాణీకరించుకొని యథామతి తనరచన సాగించియుండుట కానసగును. మన తెనుఁగుననే దీనిని పలువురు రసజ్ఞులు అనువదించియున్నారు. అందుఁ గొందఱు మహామేధావులు, మాననీయులు. వీరిలో మూలము నర్థ్యర్థమనుసరించినవారు కొందఱు, ఇంచుక స్వాచ్ఛంద్య మవలంబించినవారు కొందఱు. ఇట్టిచోట్ల నొండొరుల రచనలకుఁ గొండొక పోలిక తప్పినదియుం గాదు. ఈ గ్రంథము అట్టివారి తెనిఁగింపులను మీఱవలయునని కాని వానితోఁ దులఁతూఁగవలయునని కాని యుపక్రమింపఁబడినది కాదు. ఇది శ్రీ ఆంధ్రసభవారికి సొంతమయిన శాకుంతలము ఒకటి యుండవలయు నను తలంపునఁ దుదిముట్టింపఁబడిన రచన కాని మేటికవులతో పోటీ సేయవలయునను నుబలాటమున ఉరవడింపఁబడినది కాదు. నిర్మత్సరు లగు విపశ్చిత్సత్తములు సాకల్యము చిత్తగించి యిందలి దోసఁగుల నుపేక్షించి గుణలేశమును గైకొని నా పూర్వకృతులంబోలె దీనిం గూడ తమ ప్రీతికిం బాత్రముగావింతురుగాక యని వేఁడుచున్నాఁడను.

నెల్లూరు,
23-11-1953

గ్రంథకర్త.

# పాత్రములు

## —: పురుషులు :—

| | | |
|---|---|---|
| దుష్యంతుఁడు | ... | కథానాయకుఁడు. |
| సూతుఁడు | | |
| వైఖానసుఁడు | | |
| శిష్యులు – నల్వురు. | | |
| మాఢవ్యుఁడు | ... | విదూషకుఁడు. |
| రైవతకుఁడు | ... | దౌవారికుఁడు. |
| సేనాపతి | | |
| ఋషికుమారులు – నల్వురు. | | |
| కరభకుఁడు | ... | రాజుతల్లి పంపిన భటుఁడు. |
| కణ్వమహర్షి | ... | శకుంతలను పెంచిన తండ్రి. |
| శార్ఙ్గరవుఁడు, శారద్వతుఁడు | ... | కణ్వశిష్యులు. |
| వాతాయనుఁడు | ... | కంచుకి. |
| సోమరాతుఁడు | ... | రాజపురోహితుఁడు. |
| కావలి నాయకుఁడు | | |
| జానుకుఁడు, సూచకుఁడు | ... | కావలివాండ్రు. |
| ధీవరుఁడు | ... | అభిజ్ఞానాంగుళీయకము దెచ్చినవాడు. |
| మాతలి | ... | ఇంద్రసారథి. |
| భరతుఁడు | ... | దుష్యంతుని కుమారుఁడు – బాలుఁడు. |

| | | |
|---|---|---|
| కశ్యపుఁడు | ... | మరీచిపుత్త్రుఁడు-సురాసురుల తండ్రి. |
| గాలవుఁడు | ... | కశ్యపశిష్యుఁడు. |

—: స్త్రీలు :—

| | | |
|---|---|---|
| శకుంతల | ... | కథానాయిక. |
| అనసూయ, ప్రియంవద | ... | శకుంతల చెలికత్తెలు. |
| గౌతమి | ... | వృద్ధతాపసి. |
| మునిపత్నులు | ... | ముగ్గురు. |
| వేత్రవతి | ... | ప్రతీహారి. |
| సానుమతి | ... | అప్సరస - మేనకసఖి. |
| మధురిక, పరభృతిక | ... | ఉద్యానపాలికలు. |
| చతురిక | ... | దుష్యంతుని పరిచారిక. |
| తాపసపురంధ్రులు | ... | ఇద్దరు. |
| అదితి | ... | కశ్యపునిభార్య. |



శ్రీ

# ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలము



మ॥ ఎది యాద్యంబు విధాతృసృష్టి, కెది కొంచేఁగున్ హవిన్, హోత యె
య్యది, శ్రుత్యర్థగుణంబు వ్యాప్తమెది, యేదాఁ బ్రాణికిం బ్రాణదం
బెది భూతైకనివాస, మేర్పఱచు నెద్దే రెండు కాలంపుఁ జొ
ప్పుఁ, దదష్టాత్మల దృశ్యుఁ డీశ్వరుఁడు మిమ్ముం బ్రోచు నశ్రాంతమున్.

ప్రస్తావన

[నాంద్యంతమున సూత్రధారుఁడు తెరవంక చూచి]-ఆర్యా! నేపథ్యవిధానము పూర్తియైన నిటు గమ్ము. (నటి ప్రవేశించి)

నటి:— ఆర్యపుత్త్ర! ఇదిగో వచ్చితిని. ఏమి సెలవు?

సూత్ర:— ఈ పరిషత్తు అభిరూప భూయిష్ఠముగా నున్నది. ఇప్పుడు దీనిని శ్రీమత్కాళిదాస ప్రణీతాభిజ్ఞాన శాకుంతలమునకు విమర్శ విద్యాస్వతంత్రాభినవ తిక్కనేతి విశ్రుతులు మహోపాధ్యాయ శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు ఆంధ్రమున రచించిన యనువాదముచే నారాధింపవలయును. కావున పాత్రముల నాయిత్తపఱుచుటయంచు సావధాన వగుము.

నటి:— నటులెల్లరు సుశిక్షితులు కావున మీ ప్రయోగమున నేకొఱంతయు కలుగఁ బోదు.

సూత్ర:— ఆర్యా, ఉన్నమాట చెప్పెదను. వినుము.

క॥ తనరించుదనుక విజ్ఞుల
ననఘ మ్మని మత్ప్రయోగ మాత్మఁ దలఁప నే
రన, యెట్టి శిక్షితునకున్
దనమది విశ్వాస మరిది తన ప్రజ్ఞ యెడన్.

నటి:— అది సత్యమే. ఇప్పుడు నేను చేయవలసినదేమో ఆర్యులు సెలవిత్తురుగాక.

సూత్ర:— ఈ సభకు శ్రుతిప్రసాదనము సేఁతకన్న నన్య మేమున్నది?

**నటి:— ఆర్యపుత్త్ర! ఏ ఋతువుం గూర్చి గానము సేయు మందురు?**

సూత్ర:— అచిరప్రవృత్తమై ఉపభోగక్షమమై యున్న యీ గ్రీష్మముం గూర్చియే పాడుము—ఇదిగో ఇప్పుడు

తే॥ జల వగాహమ్ము లత్యంత సౌఖ్యదములు,
వలచుఁ బాటలములతావి వనమరుత్తు,
లబ్బు నవలీలఁ బ్రచ్ఛాయలందు నిదుర;
పరిణతి మనోహరము లౌర! వాసరములు.

నటి:— ఔను.

క॥ అళికుల దర చుంబితముల
సులలిత కేసరశిఖాతిసుభగముల శిరీ
షలతాంతమ్ములఁ దమిఁ గాం
తలు దాల్తురు స్వశ్రవోవతంసమ్ములుగాన్.

సూత్ర:— ఆర్యా, చక్కఁగాఁ బాడితివి. రాగానుబద్ధచిత్తవృత్తియై రంగమంతయు చిత్తరువుంబోలె నెట్లున్నదో చూడుము. ఇప్పుడు ఏ రూపకము ప్రయోగించి వీరి నారాధింతము?

నటి:—శ్రీ శర్మగారి యాంధ్రశాకుంతలము ప్రయోగింపుఁడని ఆర్యమిశ్రులు సెలవిచ్చిరి కదా!

సూత్ర:—చక్కఁగా జ్ఞప్తి చేసితివి. నే నదియంతయు ఈ క్షణమున విస్మరించితిని జుమా!

క॥ త్వదుదార గీతనాదము
హృది కింపయి బలిమి నను హరించెను, జవసం
పద పేర్మిఁ గృష్ణసారం
బిదిగో దుష్యంతవసుమతీశుని బోలెన్.

(ఇరువురు నిష్క్రమింతురు.)



# ప్రథమాంకము

—:౦:—

## స్థలము-I హిమాలయప్రాంతమున - అరణ్యము.

[అంత మృగమును దఱుముచు సారథితోఁ గూడి ధనుష్మంతుఁడు రాజు రథస్థుఁడై ప్రవేశించును.]

సూతుఁడు:— (లేడిని, రాజును చూచి)—ఆయుష్మంతుఁడా!

తే। వడిఁ బఱచు లేడి దాని వెన్నడి యధిజ్య
ధనువు చేఁదాల్చి వెడలు నిన్నును గనంగ,
సవనహరిణమ్ము దఱుము సాక్షాత్పినాక
పాణిఁ గనుఁగొను చందంబువాఁడ నైతి.

రాజు:—సూతుఁడా! మనల నీ సారంగము కడుదూరము కొనివచ్చినది. ఇది యిప్పుడును,—

చ॥ చెలువుగ మోముద్రిప్పి తనుఁ జేరు శతాంగము సారెఁ జూచుచున్,
బలు శరభీతి మేని పరిభాగము ముందఱిదానఁ దూఱిచి, బ
ద్యల నరతిన్నదర్భ లలఁతేక్ వివృతాస్యమునుండి జాఱ, ఖ
స్థలి నమితం బిలన్ బరిమితమ్ముఁ జరించుఁ దదాప్లుతమ్ములన్.

(విస్మయముతో) ఏమీ! నేను వెన్నాడుచునేయున్నను, నాకు దీనిం జూచుట ప్రయత్నసాధ్య మగుచున్నది.

సూతుఁడు:— ఆయుష్మంతుఁడా, ఇక్కడ భూమి మిఱ్ఱుపల్లములుగా నున్నదని, వాగెలు లాగిపట్టి రథవేగము తగ్గించితిని. అందుచేత మృగము మన కెడమైనది. ఇపుడు సమప్రదేశమునకు వచ్చినారము. ఇఁక నది దురాసదము కాదు.

రాజు:—అట్లైన పగ్గముల సడలింపుము.

సూతుఁడు:— ఆయుష్మంతుని యాజ్ఞ (రథవేగము నిరూపించి) దేవా, ఇప్పుడు చూడుఁడు.

తే॥ వాగెలు వదల్ప మునుమేను సాఁగఁజేసి
నిక్కఁజెవులు చామరశిఖల్ నిభృతములుగ
ఆత్మఖురధూళికిని నలంఘ్యమ్ము లగుచు
మృగజవేర్ష్యనో నాఁ బాఱు నీ గుఱ్ఱాలు.

రాజు:— నిజము. ఈ గుఱ్ఱములు సూర్యాశ్వములఁగూడ మీఱిపోవుచున్నవి. అట్లేకదా,

తే॥ ఎది కృశముచూడఁ ద్రుటి నదే పృథుల మగును,
నడుమ నెది భిన్న మది కనంబడు నొకటిగ,
ప్రకృతినత మవక్రతఁ దోఁచు; రథమువడికి
క్షణ మెదియునుండ దెడనేని సరసనేని.

సూతుఁడా, చూడుము ఇదిగో దీనిం గూల్చుచున్నాను.
(వింట బాణమును సంధించుచున్నాఁడు.)

(తెరలో)

ఓహో, రాజా! ఇది యాశ్రమమృగము. చంపరాదు చంపరాదు.

సూతుఁడు:— ఆయుష్మంతుఁడా, నీవును బాణపాతదూరమున నున్న యీ కృష్ణసారము నకును నడుము తాపసులు వచ్చుచున్నారు.

రాజు:— (సంభ్రమముతో)—అట్లైన గుఱ్ఱముల నాఁపుము.

సూతుఁడు:— అట్లే, (అని రథము నిలుపుచున్నాఁడు.)

[అంత, ఇర్వురతో వైఖానసుఁడు ప్రవేశించును.]

వైఖానసుఁడు:— (చేయెత్తి)—రాజా!

త్వరితగతి॥ వదలకుము వదలకుము బాణమ యుష్మన్
మృదుకుసుమసమమృగశరీరమున; డాయన్
బెదరుగొను హరిణముల బీదయుసు రేడన్
భిదురపటుభవదిషుల వేగమిది యేడన్.

(ఇంకను)

చ॥ వదలకుమయ్య! బాణమును బ్రన్నని యీ హరిణంపుమేనిపై
వదలుమురయ్య! దారుణపువహ్నిశిఖన్ గుసుమోచ్చయంబుపైఁ
గదిసినయంత బెగ్గిలు మృగమ్ములజీవితలేశ మేఁడ? గో
త్రిదశుస వజ్రసారములు త్వద్విశిఖంబు లివేడ? భూవరా!

కాఁబట్టి,

క॥ కృతసంధానము బాణము
ప్రతిసంహారణ మ్మొనర్పు, రాజోత్తమ! నీ
శితశరము లార్తుల భయో
ద్ధతి డింపఁగఁగాని కాదదండ్యుల నొంపన్.

రాజు:— ఇదిగో, బాణము నుపసంహరించితిని. (బాణమును - తూణీరమునఁ బెట్టుచున్నాఁడు.)

వైఖానసుఁడు:— పురువంశప్రదీపకునకు నీకు తగియున్నది యీ వృత్తము. (చేయెత్తి)

క॥ పురువంశప్రభవుఁడ వగు
ధరణీనాథునకు నీకుఁ దగు నీచరితం
బరుదార నిట్లె గుణసం
భరితుఁ బడయుమయ్య చక్రవర్తిఁ బుత్త్రున్.

రాజు:— (నమస్కరించి) బ్రాహ్మణవచనము పరిగ్రహించితిని.

వైఖానసుఁడు:— రాజా! మేము సమిధలకొఱకు ఇచ్చటికి వచ్చినారము. అదిగో మాలినీతీరమున ఆ కనఁబడునదే కులపతులు కణ్వులవారి యాశ్రమము. ఇతర కార్యముల కడ్డము కాదేని తమరు అచటి కేఁగి అతిథిసత్కారము గ్రహింత్రు గాక.

క॥ ప్రతిహత విఘ్నంబుల, ర
మ్యతపస్విక్రియలఁ జూచి మౌర్వీకిణ చి
హ్నిత మింతమాత్ర మద్భుజ
మిత మేర్పడఁ బ్రోచునంచు నెఱిఁగెద వధిపా!

రాజు:— కులపతులవారు ఆశ్రమమున నున్నారా?

వైఖా:— లేరు. కుమారికను శకుంతలను అతిథిసత్కారమునకు నియోగించి, ఆమె ప్రతికూలదైవమును శమింపఁజేయుటకు వారు సోమతీర్థ మేఁగినారు.

రాజు:— సరే. మే మామెనే దర్శించెదము. మహర్షులవారికి మా భక్తి ఆమెయే దెలుపఁగలదు.

వైఖా:— ప్రభూ, ఇఁక మా పనిమీఁద మేము పోయెదము.

(తాపసులు నిష్క్రమింతురు.)

రాజు:—సూతుఁడా, గుఱ్ఱములను తోలుము. పుణ్యాశ్రమదర్శనమున మనలఁ బవిత్రీకరించుకొందము.

సూతుఁడు:—చిత్తము. (అని మరల రథవేగము నభినయించుచున్నాఁడు.)

రాజు:—(అంతటం జూచి) సూతుఁడా, చెప్పకయే తెలియుచున్నది యిది ముని ఆశ్రమాభోగ మని.

సూతుఁడు:—ఎట్లు తెలియుచున్నది?

రాజు:—నీవు చూడవా ఏమి? ఇక్కడ

శా॥ కీరాక్రాంతతరుకోటరచ్యుతములై క్రిందంబడుఁ నివ్వరుల్;
గారల్నూఁటినతీరు తెల్పెడి శిలల్ ప్రస్నిగ్ధముల్; నమ్మికన్
దారుఁ లేళ్లు రవాప్తి కుల్కక నిజస్థానంబులందుఁ; జలా
ధారాధ్వమ్ములు వల్కలాగ్రగత పాథస్స్యందరేఖాంకముల్.

మఱియును,

చ॥ కడుగు మరుద్విలోలమగు కాలువనీరు ద్రుమంపుటంఘ్రులన్
గడుకొను నాజ్యధూమకలనన్ జివురాకులు రక్తిదూలు, బె
గ్గడిల కివే కురంగపృథుకమ్ములు లూనకుశాంకురంబులౌ
నెడలను మెల్లమెల్లఁ జరియించు వరోపవనస్థలంబులన్.

సూతుఁడు:—సర్వము నుపపన్నముగా నున్నది.

రాజు:—(ఇంచుక దూరము పోయి) సూతుఁడా! ఆశ్రమవాసులకు మనవలన నలజడి కలుగకుండుఁగాత. రథము నిటనే నిలుపుము. నేను దిగియెదను.

సూతుఁడు:—పగ్గముల బిగియఁబట్టితిని. ఆయుష్మంతుఁడు దిగవచ్చును.

రాజు:—(దిగి) తపోవనములలో వినీతవేషముతోఁగదా ప్రవేశింపవలయును. ఇవి పట్టుకొనుము. (అని ధనువును, ఆభరణములను సూతుని చేతి కిచ్చి) నేను తాపసుల సందర్శించి వచ్చులోపల గుఱ్ఱముల నీటియొద్దకుఁ దీసికొనిపోయి యలసటం బాపుము.

సూతుఁడు:—చిత్తము. అట్లే చేసెదను.

(అని నిష్క్రమించును.)

[స్థలము-II అచటనే కణ్వాశ్రమము.]

రాజు:—(పరిక్రమించి)
ఇదియే ఆశ్రమద్వారము. లోనికిం జనియెదను. (ప్రవేశము నభినయించుచు, నిమిత్తము సూచించి)

క॥ ఇది శాంతమగు తపోవన
మదరెడి భుజ మెట్లు దీనికగు ఫలమిట? ని
ట్లు దలంపనేల? సర్వ
త్ర దారు లేరుపడును భవితవ్యంబులకున్.

(తెరలో)

ఇటురండు, సఖులారా ఇటురండు.

రాజు:—ఈ వృక్షవాటికకు దక్షిణముగా ఏవో ఆలాపములువోలె వినఁబడుచున్నవి. ఆ ధ్వని వచ్చువంకకు పోయెదను. (పరిక్రమించి) వారె వచ్చుచున్నారు తపస్వికన్యలు. తమ యీడునకుఁ దగిన జలకలశములతో తపోవనమునందలి తలిరుఁబ్రాయపుఁ జెట్లకు నీళ్లుపోయుటకు — అహో! వీరి దర్శన మెంత మనోహరముగా నున్నది.

తే॥ రాణివాసమ్ములను గానరాని యిట్టి
యాకృతి తపోవనస్థకన్యకల కున్న
అచ్చెరియ మేల? ఉజ్జ్వలోద్యానలతల
బహుగుణమ్ములఁ గడకొత్తు గహనలతలె.

నేను చెట్లచాటున నిలిచి వీరి వ్యాపారము తిలకించెదను. (అని చూచు చుండును.)

(అంత శకుంతల తన యిద్దరు చెలికత్తెలతోఁ బ్రవేశించుచున్నది.)

శకుంతల:— చెలులారా! ఇటు రండు. ఇటు రండు.

అనసూయ:— సఖీ - శకుంతలా — తాతపాదులు కాశ్యపులవారికి, నీకంటె ఆశ్రమ తరువులమీఁద నే ఎక్కువ మక్కువయని తలఁచుచున్నాను. ఎందువల్లననఁగా నవమాలికాకుసుమపేశలను నిన్నుఁగూడ వృక్షపాదసేచనకు నియోగించుట చేత,

శకుంతల:— నాయనగారియాజ్ఞ యనియే గాదు, ఈ పని నాకును ప్రియమైనదే. వీని పట్ల నాకు సోదరప్రేమ కలదు.

(అని వృక్షసేచన నభినయించును.)

రాజు:—ఏమీ? యీ సుందరి కణ్వదుహితయా? పూజ్యులగు కాశ్యపులవారు చక్కఁగా నాలోచించినవారు కారు. ఈమె నెట్టి యాశ్రమధర్మమునఁ బెట్టినారు!

తే॥ ప్రకృతిసౌందర్యకలిత మీవపువు నాత్మఁ
దలఁచు నేఋషి తపమున కలవరింప
తథ్య మసితోత్పల పలాశధార చేత
నిధ్మవిచ్ఛేద మొనరింప నెంచు నతఁడు.

కానీ, వారి కనుమాన మొదవకుండ చెట్టుచాటుననుండియే యీ కోమలిం జూచెదను.

(అని యట్లే చేయును.)

**శకుంతల:—అనసూయా, ప్రియంవద దయమాలి నా కంచెలను గట్టిగా బిగించినది. ఇంచుక సడలింపుము.**

**అనసూయ:**—అట్లే చేసెదను.

**ప్రియంవద:**—(నవ్వుచు) చెలీ! దీనికి నన్నేల దూఱెదవు? నీ వక్షోరుహముల విరివి సేయుచున్న నీ జవ్వనమునే ఉపాలంభింపుము.

**రాజు:**—ఈమె చక్కఁగానే చెప్పినది.

క॥ అలఁతి ముడి యంసమున శో
భిలు వల్కము చన్నుదోయి విరివిం గప్పన్
చెలువ నును మేను చెలువము
వెలుపదు కారాకులనడివిరియుం బోలెన్.

ఈ యువతి మేనికి వల్కల మెంతమాత్రము తగనిదయ్యును అలంకారలక్ష్మిని వర్ధిలఁజేయుచునే యున్నది.

చ॥ సరసిరుహంబు శైవల నిషక్తము యయ్యును రమ్యమే యగున్
సిరినె వహించుఁ జందురుఁడు చిహ్నమనచ్ఛము మేనఁ దాల్చియున్
కరము రహించు వల్కలముగట్టియు నీ లలితాంగి యట్లె, య
ద్దిర! మధురంపుటాకృతుల తీరునకున్ దొడవేది కాదిలన్.

**శకుంతల:**—(ఎదుటఁ జూచి) చెలులారా!
ఈ పొగడగున్న గాలికిఁ జలించు తలిరాకు వ్రేళులతో నన్నుఁ బిలుచుచున్నది దీనిని గారవించెదను.

(అని పరిక్రమించును.)

**ప్రియంవద:**—సఖీ, శకుంతలా! నీవు ఇక్కడనే ముహూర్తమాత్రము నిలువుము. నీవు సమీపమున నుండఁగా, ఈ పొగడ లతతోఁ గూడినదివోలె శోభిల్లుచున్నది.

**శకుంతల:**—అందుచేతనే గదా నీవు ప్రియంవద వైతివి.

**రాజు:**—ఈమె ప్రియంవదమాత్రమే కాదు. ప్రియమయ్యును, సత్యమునే చెప్పినది ఎట్లన్న, ఈ యువతికి

ఆ॥ పల్లవారుణమ్ము పరికింప నధరమ్ము
మృదులవిటపసమము లిరుభుజములు
ననయుఁబోలె నెంతయును లోభనీయమ్ము
యౌవనమ్ము సజ్జ మంగకముల.

**అనసూయ:**—సఖీ, శకుంతలా! ఇది 'వనజ్యోత్స్న'యని నీవు నామకరణముగావించిన విరజాజి తీవియ; బాలసహకారుని స్వయంవర వధువు; దీనిని మఱచితివా **ఏమి?**

శకుంతల:—అట్లైన నన్ను నేనే మఱతును. (లతను సమీపించి) చెలీ! రమణీయకాలమున ఈ లతాపాదప మిథునమునకు కలయిక సమకూరినది. నవకుసుమయౌవన వనజ్యోత్స్న; స్నిగ్ధపల్లవతచేత ఉపభోగక్షముఁడు ఈ బాల సహకారుఁడు.

(చూచుచు నిలుచును.)

ప్రియంవద:—(చిఱునవ్వుతో)—చెలీ, అనసూయా! మన శకుంతల ఈ వనజ్యోత్స్నను ఇంతగా ఏల చూచుచున్నదో నీ వెఱుఁగుదువా?

అనసూయ:—నాకుఁ దెలియదు. నీవు చెప్పుము.

ప్రియంవద:—విను. 'వనజ్యోత్స్న' ఎట్లు అనురూపమైన పాదపములోఁ గూడుకొన్నదో అట్లే తానును అనురూపుఁడైన వరుని బొందుదునుగాక యని.

శకుంతల:—(అనూయతో) నిజముగా నిది నీ మనస్సులోనున్న కోరిక

(అని కలశమును వంచును.)

రాజు:—(ఆత్మగతము) దుర్లభముకదా యీ మనోరథము. కులపతులవారికి ఈజవ్వని అసవర్ణక్షేత్రసంభవయై యుండునా? ఏల సందేహము?

తే॥ సందియము లేదు; క్షత్త్రార్హ; సరసిజాక్షి
శుద్ధ మీఁదెంద మభిలషించుటనె తెలిసె;
సంశయాధీనవస్తు నిశ్చయమునందు
స్వాంతగతులె ప్రమాణంబు సజ్జనులకు.

ఐనను సత్యము తెలిసికొనియెదను.

శకుంతల:—(సంభ్రమముతో) నీళ్లుపోయుటకు జడిసి ఈ తుమ్మెద విరజాజిని విడిచి నా మోముమీఁదికి వచ్చుచున్నది.

(అని భ్రమరబాధ నటించును.)

రాజు:—(సాభిలాషముగాఁ జూచి) అహో! బాధనముకూడ ఈ కొమరాలియందు రమణీయముగానే యున్నది.

తే॥ భృంగ మెందెం దెదుర్కొను బెళుకుఁగనులఁ
గనుచు నందంద కలికి యకామయయ్యు
నభ్యసించుఁబో భ్రూవివర్తాన్వితముగ
భీతికలనమ్మునను దృష్టివిభ్రమమ్ము.

(అనూయతో)

చ॥ తరళకటాక్షపాత్రమవు; తాఁకెదు కంపవతిన్ బొరింబొరిన్;
దరిసి రహస్యమాడెదవొ నాఁ జెవిచెంత స్వనింతు వల్లనన్;

గరము విదుర్పఁ గ్రోలెదవు కామసుఖమ్ములదీవి మోవి; బం
భర! కృతివీవె మేమ హతభాగ్యుల, మెందును దత్త్వచర్చలన్.

శకుంతల:—సఖులారా, రండు. ఈ తుమ్మెదదుండగీనిచే వేధింపఁబడుచున్న నన్ను రక్షింపుఁడు.

అనసూయాప్రియంవదలు:—(చిఱునవ్వుతో)
నిన్ను రక్షింప మే మెవ్వరము? దుష్యంతుని బిలువుము. రాజుకదా తపోవన రక్షకుఁడు.

రాజు:—(స్వగతము) వీరి కగపడుటకు నాకు ఇదే సమయము. ఎవఁడురా అక్కడ? (అని యర్ధోక్తిలోనే ఆలోచించుకొని) నేను రాజునని వీరికిం దెలియఁగూడదు. ఇదే యిట్లు పలికెదను.

శకుంతల:—ఈ దుష్టమధుపము నన్ను వెన్నాడుచునే యున్నది. కావున వేఱొక తావునకుం బోయెదను. (కొండొకపోయి నిలిచి దృష్టిసారించి) అయ్యో! ఇది యిక్కడికిని నన్ను వెన్నాడుచున్నదే.

రాజు:—(వడిగా సమీపించి)

క॥ ఎవఁడుర వీఁడొనరించెడు
నవినయమును, ముగ్ధలైన యమికన్యలకున్?
దివిరి ఖలుల శాసించుచు
నవనీస్థలి బౌరవుం డుదారత నేలన్.

(అందఱు రాజుం జూచి యించుక వెఱఁగుపడుదురు.)

అనసూయ:—ఆర్యా, ప్రమాద మేమియును లేదు. ఈ మా ప్రియసఖి తుమ్మెద కలంతపెట్టఁగా భయపడినది (అని శకుంతలం జూపును.)

రాజు:—(శకుంతల కభిముఖుఁడై)—తపస్సు వర్ధిల్లుచున్నదా?

శకుంతల:—(సాధ్వసముచే బదులుచెప్పకుండును.)

అనసూయ:—ఇప్పుడు అతిథి విశేషలాభముచే మఱియు వర్ధిల్లుచున్నది. స్వాగత మార్యునకు. సఖీ శకుంతలా! నీవు పర్ణశాలకుఁ బోయి అర్ఘ్యము కొనితెమ్ము. ఇది ఆర్యునకు పాద్యము కాఁగలదు.

రాజు:—మీ ఉదారవాక్కులచేతనే ఆతిధ్యము నెఱవేఱినది.

ప్రియంవద:—అట్లైన ప్రచ్ఛాయశీతలమైన యీ సప్తపర్ణ వేదికయందు ఆర్యుఁడు కూర్చుండి పరిశ్రమక్లేశ మపనయించుకొనుఁగాక.

రాజు:—మీరును జలసేచనచే నలసిపోయిన ట్లున్నారు.

అనసూయ:—సఖీ! శకుంతలా! అతిథుల పర్యుపాసించుట మన కుచితము. మనమును కూర్చుందము (అందఱును కూర్చుందురు.)

శకుంతల:—(విమర్శించి ఆత్మగతము) ఏమిది? ఇతనిం జూచి తపోవనమునం గారాని వికారమునకు లోనగుచున్నాను.

రాజు:—(అందఱిని జూచి)—అహో! సమవయోరూప లగు మీ సౌహార్ద మెంత రమణీయముగా నున్నది!

ప్రియంవద:—(జనాంతికము)—అనసూయా! ఎవరే యీతఁడు చతుర గంభీరాకారుఁడు, మధురప్రియభాషణములాడుచు ప్రభువువలెఁ గానవచ్చుచున్నాఁడు.

అనసూయ:—(జనాంతికము)—సఖీ! నాకును కౌతుకముగానే యున్నది. అడిగి చూచెదను. (ప్రకాశముగా) ఆర్యుని మధురాలాపములవలని విశ్వాసముచే నడుగుచున్నాను, ఆర్యునిచే నే రాజర్షి వంశ మలంకరింపఁబడుచున్నది? ఏదేశప్రజలు ఆర్యుని విరహముచేఁ బర్యుత్సుకు లగుచున్నారు? ఈ సుకుమార శరీరము ఏ నిమిత్తముచేతఁ దపోవన పర్యటన క్లేశమునకుఁ బాల్పఱుపఁబడినది?

శకుంతల:—(ఆత్మగతము) హృదయమా! తత్తరపడకుము. నీ వెఱుఁగఁగోరినదానిని అనసూయయే యడుగుచున్నది.

రాజు:—(ఆత్మగతము) ఇపుడు నన్ను నే నెట్లు తెలుపుకొందును? ఎట్లు మఱుఁగు పఱుచుకొందును? కాని ఇట్లు చెప్పిచూచెదను. (ప్రకాశముగా) నేను పౌరవునిచే రాజుచే ధర్మాధికారమున నియుక్తుఁడను. ఆశ్రమవాసుల క్రియలు నిర్విఘ్నముగా సాగుచున్నవో కనుఁగొనుటకు ఈ ధర్మారణ్యమునకు వచ్చితిని.

అనసూయ:—ఇపుడు ధర్మచారులు సనాథులైరి.

శకుంతల:—(శృంగారలజ్జ నభినయించును.)

అనసూయా ప్రియంవదలు:—(ఉభయుల ఆకారములు చూచి) (జనాంతికము) సఖీ! శకుంతలా! నాయనగారు ఇపు డిచట నే ఉండిన?

శకుంతల:—(కోపమున)—ఉండిన నేమి?

సఖులు:—తన జీవిత సర్వస్వమునైన నిచ్చి యతిథిని కృతార్థునిగావించి యుండురు.

శకుంతల:—సఖులారా! చాలు లెండు; మీరు మనసులో నేదో మర్మము పెట్టుకొని మాటలాడుచున్నారు. మీ మాటలు నేను వినను.

రాజు:—మేమును, మీ సఖినిగూర్చి కొంచెము అడుగఁదలఁచి యున్నాము.

సఖులు:—ఆర్యా! అడుగుట అనుగ్రహము కదా.

రాజు:—కాశ్యపులవారు శాశ్వత బ్రహ్మనిష్ఠులని ప్రసిద్ధి. ఈ మీసఖి వారికి ఆత్మజ యగుట యెట్లు?

అనసూయ:—ఆర్యుఁడు వినుఁగాక; కౌశికుఁడని గోత్రనామము ధరించిన మహా ప్రభావుఁడు రాజర్షి కలఁడు.

రాజు:—అవును, వినియున్నాము.

అనసూయ:—అతఁడు మాచెలిని గన్నతండ్రి. అతఁడు విడిచిపెట్టఁగా కౌశ్యపుల వారు పెంచి పెద్దచేయుటచే ఈమెకు తండ్రి యాయెను.

రాజు:—'విడిచిపెట్టఁగా' ననుటచే కౌతుక మగుచున్నది. ఆమూలము వినఁగోరుచున్నాను.

అనసూయ:—విను మార్యా! పూర్వ మా రాజర్షి గౌతమీతీరమున ఉగ్రతపసు చేయుచుండఁగా శంకితులై నియమవిఘ్న మొనర్ప దేవతలు మేనక అనుపేరి అప్సరసను బంపిరి.

రాజు:—దేవతలకు ఎప్పుడు కలిగినదే ఇది, అన్యసమాధిభీరుత్వము. అవల?

అనసూయ:—అవల వసంతోదారసమయమున, ఉన్మాదకారిణియైన యామె యాకృతిం జూచి (అని యర్ధోక్తిలో సిగ్గుచే విరమించును.)

రాజు:—అవలి వృత్తాంతము తెలియుచునే యున్నది. ఈ సుందరి సర్వథా అప్సరస్సంభవయే.

అనసూయ:—అవును.

రాజు:—ఇది ఉపపన్నముగానే యున్నది.

క॥ ఈతీరు చెలువ మేక్రియ
జాతంబగు మర్త్యజాతిజ వధూటులలో
ఏతఱిఁ బ్రభాతరళమా
జ్యోతి ధరాతలమునుండి యొదవుట కలదే?

శకుంతల:—(తలవంచుకొని యుండును.)

రాజు:—(ఆత్మగతము) నా మనోరథమునకు అవకాశము లభించినది. చెలి పరిహాసమున కాడిన యీ కాంతవరప్రార్థనము మాట విని నా మనస్సు ద్వైధీభావ కాతర మగుచున్నది.

ప్రియంవద:—(చిఱునవ్వుతో శకుంతలం జూచి, నాయకుని కభిముఖియై) ఆర్యా! ఇంకను ఏమో యడుగఁదలఁచిన ట్లున్నారు.

శకుంతల:—(సఖిని వ్రేలిచే బెదరించుచున్నది.)

రాజు:—చక్కఁగా నూహించితివి. సచ్చరిత్రశ్రవణలోభముచే మీ చెలింగూర్చి ఇంకను గొంత యడుగఁగోరుచున్నాను.

ప్రియంవద:—సందేహ మేల? అసంకోచముగా నడుగఁదగినవారు కదా తపస్వి జనులు.

రాజు:—మీ సఖింగూర్చి నేను దెలియఁగోరునది.—

తే॥ స్మరగతి నిరోధి వైఖానసవ్రతమ్ము
*నా ప్రదానమ్మొ సలుపునా? యట్టుగాక,
ఇటనె మదిరాక్షి యుండునా యెల్లవేళ?
సదృశదృగ్వల్లభైణీవ్రజమ్ముతోడ?

ప్రియంవద:—ఆర్యా! ఈమె ధర్మాచరణమందును స్వతంత్రురాలు కాదు. ఈమెను అనురూపవరున కీయవలయుననియే నాయనగారి సంకల్పము.

రాజు:—అట్లైన ఈ కోరిక దురవాపము కాదు.
(స్వగతము) సందేహము తీఱినది.

క॥ హృదయమ! సస్పృహమవు క
మ్మొది దారుణదహనమంచు నెంచితొ యిపు డ
య్యది నిక్కమునకు స్పర్శా
ర్హ దీప్తిసంకలిత దివ్యరత్నం బయ్యెన్.

శకుంతల:—(రోషముతోఁ బోలె)
అనసూయా! నేను బోయెదను.

అనసూయ:—ఏల? యెందుకుఁ బోయెదవు?

శకుంతల:—ప్రియంవద అసంబద్ధప్రలాపములు ఆర్యగౌతమికి నివేదించుటకు.

అనసూయ:—సఖీ! ఆశ్రమవాసులకు ఇది ఉచితము కాదు. ఉత్తముఁడగు అతిథిని సత్కరింపక వదలి స్వచ్ఛందముగా వెడలిపోవుట.

శకుంతల:— (ఏమియు పలుకక బయలువెడలును.)

రాజు:—(ఆత్మగతము) ఆహా! పోవుచునే యున్నదే. (పట్టుకొనఁగోరియుఁ దన్నుఁ దాను నివారించుకొని, స్వగతము) ఆహా! కాముకజనచిత్తవృత్తి చేష్టాప్రతిరూపము కదా! నేను

క॥ తెగువ మునికన్య వెంట న
రుగఁగోరియు నీతిచే నిరుద్ధుఁడనై యొ

---

* పాఠాంతరము:—పెండ్లివఱకే చరించునా బిసరుహాక్షి
యట్లుగా కిందె వసియించునా సతమ్ము?

ప్పాగ నెలవు వదలకయుం బో
యి గ్రమ్మఱినవాఁడఁబోలె నేనైతి నిటన్.

ప్రియంవద:—(శకుంతలను ఉపరోధించి) నీవు పోవుట యుక్తముకాదు.

శకుంతల:—(బొమలు చిట్లించుచు) ఎందువలన?

ప్రియంవద:—నీవు నాకు రెండు వృక్షసేచనలు అప్పుపడియున్నావు. వచ్చి ఆ యప్పు తీర్చిపొమ్ము. (అని బలాత్కారముగా నివారించుచున్నది.)

రాజు:—కల్యాణీ! ఈతన్వి ఇప్పటికే అలసిపోయిన ట్లున్నది. చూడుము.

మ॥ అతిమాత్రారుణమయ్యెఁ గేల్ కలశ మొయ్యంబూన, నంసమ్ములా
నతమయ్యెన్; స్తనకంపమేదదిపుడున్; బ్రశ్వాసముల్ దీర్ఘముల్
శ్రుతి సంసక్త శిరీషరోధియయి కూరున్ ఘర్మ మాస్యమ్మునన్;
సతి హాస్తమ్మున నొంట దిద్దు నిదె స్రస్తంబైన ధమ్మిల్లమున్.

కావున ఈ యబలయప్పు నేను తీర్చెదను. (అని యుంగరము నీయఁబోవును.)
(సఖులు నామముద్రాక్షరములు తిలకించి ఒకరి నొకరు చూచుకొందురు.)

రాజు:—మీరు నన్నన్యథా తలంపవలదు. రాజపరిగ్రహ మిది. నన్నుఁ దపోవన రక్షణమునకు నియోగించినది వారే కదా!

ప్రియంవద.—అట్లైన ఈ అంగుళీయకము ఆర్యుని వ్రేలిఁ బాయఁదగదు. ఆర్యుని పలుకుల చేతనే మా చెలియప్పు తీఱినది. (ఇంచుక ప్రక్కకుఁ దిరిగి) శకుంతలా! ఆర్యుఁడే—కాదు - మహారాజే నీ యప్పు దయచేఁ దీర్చినాఁడు. ఇంక నీవు పోవచ్చును.

శకుంతల:—(స్వగతము) నా వశమయేని (ప్రకాశముగా) .పొమ్మనుటకుఁగాని వల దనుటకుఁగాని నీ వెవ్వతవు?

రాజు:—(శకుంతలం జూచుచు) - (ఆత్మగతము)
ఈ కలికియందు నా కెట్లో, ఆ కలికికిఁగూడ నాయందు అట్లే యుండఁబోలు. అట్లైన నా కోర్కి తీఱుటకు అవకాశము కలదు.

తే॥ నానుడులతోడఁ దననుడిన్ గలుపకున్న
మగువ చెవియొగ్గివిను నేను మాటలాడ;
నాయెదుర నిల్వ దేనియు నాతిచూపు
లన్యవిషయమ్ములకు సుంతయైనఁ బోవు.

(తెరలో)

తపస్విజనులారా, తపోవనజంతువుల రక్షించుకొనుఁడు. వేటకు వచ్చిన దుష్యంతమహారాజు ఇటనే సమీపమున నున్నాఁడు.

పృథ్వి॥ తురంగమ ఖురోత్థితోద్ధుర రజఃప్రతానం బిదే
జర ద్దినక రారుణచ్ఛవి దలిర్పఁగా నాశ్రమో
ర్విరుట్సముదయమ్ముపై విటప సక్తతోయార్ద్రి వ
ల్కరాజిపయి వ్రాలు నొక్కటఁ బతంగసంఘంబనన్.

మఱియు,

శా॥ స్ఫారాఘాత నిపాతితోన్నత తరుస్కంధైక దంతమ్ముతో
దారింగూరిన తీవప్రోవె నిజపద్బంధంబుగా, నేణముల్
పేరెం బెత్తకలంగి మూర్తము తపోవిఘ్నంబునాఁ జొచ్చు ధ
ర్మారణ్యస్థలి హస్తి యియ్యదె శతాంగాలోకన భ్రాంతమై.

(అందఱును విని యించుక వెఱఁగుపడుదురు.)

రాజు:—(ఆత్మగతము) ఇసీ, సైనికులు నన్ను వెదకుచు తపోవనము ఉపరోధించు చున్నారు. నేను పోయి వారిం గలసికొనెదను.

అనసూయ:—ఆర్యా, ఈ అరణ్యగజవృత్తాంతముచే భయమగుచున్నది. పర్ణశాలకుఁ బోవ మాకు సెలవిండు.

రాజు:—(తొట్రుపాటుతో) పొండు, అబలలారా పొండు. ఆశ్రమమునకు ఏబాధయుఁ గలుగకుండ నేను జూచుకొందును.

(అందఱును లేతురు.)

సఖులు:—ఆర్యా, తమకు యథార్హసత్కారము కావింపని మేము మరల దర్శన మిమ్మని యడుగ సిగ్గిల్లుచున్నాము.

రాజు:—అట్లుకాదు. మిమ్ముఁ జూచుటచేతనే, నేను సత్కృతుఁడ నైతిని.

(శకుంతల ఏదోవ్యాజమున ఇంచుక విలంబించి చెలులతో నెడలిపోవుచున్నది.)

రాజు:—(ఆత్మగతము) వీరు పోవనే పోయిరి; ఇపుడు రాజధానికి మరలవలయునను తలంపు మందగించినది. పరిజనులఁ జూచి వారిని ఆశ్రమమున కనతిదూరమున నుండ నియమించెదను. శకుంతలావ్యాపారమునుండి మనస్సు మరలింపఁ జాల కున్నాను. ఏలన—

క॥ నడచున్ మెయి ముందఱికిన్
వడి వెనుకకుఁబాఱు మన సపరిచితమై, యె
క్కుడుగాలి కెదురుకొని పోఁ
బడుసిడమును దానిపట్టు వస్త్రమువోలెన్.

(అందఱు నిష్క్రమింతురు.)

# ద్వితీయాంకము

——:O:——

## స్థలము – అడవి, గుడారములయెదుట.

## ప్రవేశకము*

(విషణ్ణుఁడై మాఢవ్యుఁడు ప్రవేశించును.)

మాఢవ్యుఁడు:—(నిట్టూర్పుతో) ఏమి గ్రహచార మిది? మృగయాశీలుని ఈ రాజును ఛాయవలె వెన్నంటివచ్చుట; 'ఇదిగో లేడి, అదిగో పంది, అల్లదే పులి' అని యల్లరితప్ప వేఱుమాటలే లేవుగా! మిట్టమధ్యాహ్నపు ఎండనైనను లెక్కగొనక అడవినుండి అడవికి నడుచుచు గోష్పాదమంతైనను నీడలేని ప్రదేశాలలో వేఁటాడియే తీఱవలెనా?—దాహానకు, కుళ్లిన ఆకలములచే చేదువాఱి కంపుకొట్టు సెలయేళ్లనీళ్లు:- కూటికి, వేఁటాడిన జంతువుల ఎప్పుడో దొరకినక్షణము నిప్పుమీఁదవేసి పొరలించికాల్చిన మాంసము. రాత్రులుకూడ గుఱ్ఱాలఏనుఁగుల కోలాహలముతో నిద్ర పూర్ణానుస్వారము. గుఱ్ఱాలమీఁద దౌడు తీసితీసి సంధిబంధము లెడలిన యెముకలతో అసలు నిద్రయేమిటి? కొంచెము కన్నుమూసితినో లేదో అడవిచుట్టును తొత్తుకొడుకులు ఈ వేఁటకాండ్ర యార్భటులతో ప్రొద్దుపొడుచుటకుముందే మేలుకొన్నాను. ఈ చప్పుడుతో కూఁతలతో చెవులు గింగురుపోవుచున్నవి. ఇంతతోనైనదా? పుండుమీఁద గాయమన్నట్లు, ఈ దిక్కుమాలిన వేఁటలో మన్మందతని వెనుకవేసి ఈయన తపోవనము చొచ్చి నా ప్రారబ్ధముకొలఁది ఒక మునికన్యను చూచినాఁడఁట. దాని పేరు 'శకుంతల' యఁట! ఆ క్షణమునుండి రాజధానికిఁ బోవుదమన్న తలఁపేలేదు నా వయస్యునకు; ఆ అమ్మాయిని తలఁచుకొనుచు రాత్రియంతయు కన్నుమూర్కనవాఁడు కాఁడు. ఏమి చేయవచ్చును? వయస్యునిరాకఁ బ్రతీక్షించెదను. (పరిక్రమించి చూచి) అడవిపూలదండలు దాల్చిన యవనతరుణులు విండ్లుపూని వెంటరాఁగా, ఇచ్చటికే వచ్చుచున్నాఁడు వయస్యుఁడు. సంధిబంధములు చెడి కదలమెదలలేనివానివలె నిలుచుండెదను. అట్లయినను కొంత విశ్రాంతి దొరకును. (అని చేతికఱ్ఱ నూఁది నిలుచును.)

(అంతట, రాజు యథోక్త పరివారముతో ప్రవేశించుచున్నాఁడు)

రాజు:—(ఆత్మగతము)

ఆ॥ దయిత సులభ కాదు, తథ్యంబ యైనఁ ద
ద్భావ దర్శనమున స్వాంత మలరె;
మనసిజుఁడు కృతార్థతను గాంచకున్నను
రతి యొనర్చు నుభయ ప్రార్థనమ్ము.

---

* ఇది, కొంతదనుక కేదారనాథుని యాంగ్లము ననుసరించుచున్నది:

(సస్మితము) కాముకుఁడు తాను వలచినవారి చిత్తవృత్తుల తన యభిప్రాయమున కనురూపముగా నూహించి వంచితుఁ డగును. కాముకుఁడు ఎంత స్వార్థపరుఁడు!

మ॥ చెలి నిద్దమ్ముగ నొండెడం గనినఁ దాఁ జింతించు స్వార్థంబు కా,
మెలమెల్లన్ జనినన్ నితంబగురుతన్ మేలద్దియున్ స్వార్థమే,
అలుకం బోవల దన్న నెచ్చెలి నసూయం బల్కుటల్ స్వార్థమే,
బళిరా! స్వార్థము కాని వెయ్యవో, ప్రియావ్యాపారముల్ కామికిన్.

విదూషకుఁడు:—(అట్లే నిలుచుండి) వయస్యా, నా కాలుసేతులు కదలుటలేదు. కావున నోటితోమాత్ర దీవించుచున్నాను. 'విజయీభవ.'

దుష్యంతుఁడు:—(చిఱునవ్వుతో) నీకు ఈ యంగవైకల్య మెందువలన?

విదూషకుఁడు:—ఎందువల్లనా? కన్నుకలఁచి కన్నీటికి కారణ మడుగుచున్నావు.

రాజు:—నీమాట నా కర్థమగుటలేదు.

విదూషకుఁడు:—అట్లైన విను. ప్రబ్బలిచెట్టు కుబ్జలీల విడంబించుట స్వభావమా? గాక నదీవేగ ప్రభావమా?

దుష్యంతుఁడు:—అందుకు ఏటివడియే కారణము.

విదూషకుఁడు:—ఆప్రకారమే నాకు నీవును.

రాజు:—ఎట్లు?

విదూషకుఁడు:—నీవు రాచకార్యముల మంటఁగలిపి ఇట్టి యాకులప్రదేశములలో వనచరవృత్తిని వరించితివి. నిజానకు పూఁటపూఁట ఘాతుకమృగముల వెంటఁ బరుగులిడుటచే సంధిబంధములు చెడి నా యంగములు స్వాధీనములు గాక యున్నవి. కాఁబట్టి దయయుంచి నాకు ఒక్కదినమేని విశ్రాంతి కడ మిమ్ము.

రాజు:—(ఆత్మగతము) వయస్యుఁడో ఇట్లు చెప్పుచున్నాఁడు. నాకును కాశ్యప కుమారిని అనుస్మరించుచు డెందము వేఁటకు విముఖ మగుచున్నది. ఏలయన—

క॥ ఎక్కిడియు, శరము దొడిగియు,
నక్కఱ విలు వంపఁజాల హరిణమ్ములపైఁ,
జొక్కంపు బెదరుఁజూపుల
నొక్కటఁ బ్రియసఖికి నేర్పు నొజ్జలొ యనుచున్.

విదూషకుఁడు:—(రాజుమొగము చూచి) నీవు మనస్సులో నేమో తలపోసికొనుచున్నావు. నా మాట అరణ్యరోదన మైనది.

రాజు:—(చిఱునవ్వుతో) మఱేమి లేదు. వయస్యుని వచనము అనతిక్రమణీయము కదా అని అనుకొనుచున్నాను.

విదూషకుడు:—దీర్ఘాయుష్మంతుడవు కమ్ము. (అని పోఁబోవుచున్నాఁడు.)

దుష్యంతుఁడు:—వయస్యా, నిలువుము. నేను చెప్పునది యింకను పూర్తి కాలేదు.

విదూషకుఁడు:—దేవా! సెలవిమ్ము.

దుష్యంతుఁడు:—అలసట తీర్చుకొన్న పిదప నీవలన నాకు ననాయాసమైన యొక పనిలో తోడ్పాటు కావలసియున్నది.

విదూషకుఁడు:—కుడుములు తినుటలోనా యేమి?

దుష్యంతుఁడు:—చెప్పెద నుండుము.

విదూషకుఁడు:—సిద్ధముగా నున్నాను.

రాజు:—ఎవఁడురా అక్కడ?

దౌవారికుఁడు:—(ప్రవేశించి) దేవా! ఏమి సెలవు?

దుష్యంతుఁడు:—రైవతకా! సేనాపతిని ఇక్కడకుఁ బిలుచుకొనిరమ్ము.

దౌవారికుఁడు:—చిత్తము. (అని నిష్క్రమించి సేనాపతిని తోడ్కొనివచ్చి) దేవర వారు ఏమో చెప్పఁదలఁచి ఈ వంకనే చూచుచున్నారు. తమరు సమీపింతురు గాక.

సేనాపతి:—(రాజును జూచి) వేఁటవలని దోసఁగులు ప్రసిద్ధములే. ఐనను ప్రభువు వారియందు అవి గుణమునకే యైనవి. అట్లే కదా.

మ॥ అనిశ జ్యాలతికా వికర్షణ దృఢత్వాన్విత పూర్వార్ధమై,
కన దర్కాంశు సహిష్ణువై, శ్రమజ లాక్రాంతంబుకా కింతయుఁ
దనువయ్యుం బటువౌట నిద్దమగు మేనన్ ప్రాణసారంబు నీ
జననాథుండు వహించు శైల విచరత్ స్తంబేరమంబున్ బలెన్.

[సమీపించి] దేవా, జయము, జయము.
ఈ యరణ్యమున ఘాతుకమృగ ప్రచార మరికట్టినారము. ఇఁక నేల యాలస్యము?

దుష్యంతుఁడు:—సేనాపతీ! వేఁటను దూషించి మాఢవ్యుఁడు నా యుత్సాహమును, భగ్నము కావించినాఁడు.

సేనాపతి:—(జనాంతికము) సఖా! విదూషకా! నీ పట్టు వదలకుము. నేను ప్రభువు వారి చిత్తవృత్తి ననుసరించి మాటాడెదను. (ప్రకాశముగా) ఈ యజ్ఞుఁడు ప్రేలనీ. వేఁటవలని గుణములకు ఏలినవారే తార్కాణము.

శా. మేనుత్థాన సమర్థమౌ నుదరపుం బెంపేద మేదశ్ఛిదన్,
గానంగానగు సత్త్వహృద్వికృతు లుగ్రక్రోధ భీత్యుత్థముల్,
ధానుష్కుండును లోల లక్ష్యభిద నుత్కర్షం గనున్, వేఁట నే
లా నైకుల్ వ్యసనమ్మనన్, గలదె మోదావాప్తి యిట్లొండెడన్.

విదూషకుఁడు:—ప్రభువుగారు నా మాట విని స్వస్థచిత్తులైనారు. నీవో అడవినుండి యడవికిఁ దిమ్మతిరిగి, మనుష్యుని ముక్కుకండఁ దినగోరు ఏ ముసలి యెలుఁగుబంటి నోటిలోనో పడిపోవుదువు.

దుష్యంతుఁడు:—భద్ర! సేనాపతీ! ఏల పలుమాటలు? మనము ఆశ్రమ సమీపముననున్నాము. అందువలన నీ వచనము నేను పాటింపనేరకున్నాను:— మఱి యిపుడు:

లయగ్రాహి. తోయములఁ గొమ్ములను ద్రోయుచు నిపాన సము
దాయముల మున్గుత లులాయ నికరమ్ముల్;
చాయగల తావులను తోయముగఁ గూడి నిర
పాయత నెమ ల్లొకట వేయుత మృగంబుల్;
భీ యెడలి పల్వల నికాయములఁ గోలములు
వే యలమి గ్రొచ్చుతఁ బరాయణత ముస్తల్
జ్యాయుతిని వీడ్కొని మదీయమును నీ ధనువు
నీ యెడను విశ్రమ విధేయ మగుఁగాతన్.

సేనాపతి:—దేవరవారి చిత్తము.

దుష్యంతుఁడు:—అట్లైన, ఈ వఱకే పోయియున్న వాగురికులఁ గ్రమ్మఱింపుము. మన సైనికులు తపోవనమునకు దూరముగా నుండునట్లు ఆజ్ఞాపింపుము.

తే. శమసహితులైన సంయమీశ్వరులయందు,
నడఁగియుండుఁ దేజమ్ము దాహక మొకంపు;
ముట్ట నిరవైన రవికాంతముల విధాన
నుద్వమింత్రది పెఱ తేజ మొరసికొనిన.

సేనాపతి:—దేవరవారి యాజ్ఞ.

విదూషకుఁడు:—పోరా. తొత్తుకొడుకా! నీ ఉత్సాహవృత్తాంతము ధ్వంసమైనది.

(సేనాపతి నిష్క్రమించును.)

దుష్యంతుఁడు:—(పరిజనమును జూచి) మీరు ఇఁక వేఁటవేషము తీసివేయుఁడు. రైవతక! నీవును నీపనిఁ జూచుకొనుము

దౌవారికుఁడు:—దేవరవారి యాజ్ఞ. (నిష్క్రమించును.)

విదూషకుఁడు:—ఇక్కడ పురుగులేకుండఁ జేసితివి. ఇప్పుడు ఈ చెట్టునీడలో అవిరళలతావితానసనాథమైన యీ శిలాతలమున నీవు కూర్చుండుము. నేనును క్షణముసేపు సుఖాసీనుఁడ నయ్యెదను.

రాజు:—ముందు నడువుము.

విదూషకుఁడు:—రా రమ్ము! వయస్యా! (ఉభయులు పరిక్రమించి ఉపవిష్టు లగుదురు.)

దుష్యంతుఁడు:—మాధవ్యా, కన్నులున్న ఫలము నీవు కోల్పోయితివి. ఏల యన, దర్శనీయమును నీవు చూచియుండలేదు.

విదూషకుఁడు:—చూచియుండలేదా? ఏల? నీవు నా యెదుటనే యున్నావుకదా.

దుష్యంతుఁడు:—ఎల్లరు ఆత్మీయమును రమణీయముగానే తలంచుచుందురు. నేనో ఆశ్రమలలామభూతను, శకుంతలంగూర్చి చెప్పుచున్నాను.

విదూషకుఁడు:—(స్వగతము) ఇతనికి నేను అవకాశ మీయను. (ప్రకాశము)—వయస్యా, ఇప్పుడు జడదారికన్నెకూడ నీకుఁ గోరఁదగినదిగాఁ గానవచ్చుచున్నదా?

దుష్యంతుఁడు:—సఖుఁడా, పరిహార్యమైన వస్తువుమీఁదికి పౌరవులమనస్సు పోవదు సుమా.

విదూషకుఁడు:—అట్లైన, నిది యేమి?

దుష్యంతుఁడు:—ఆకన్య

తే. అమర బిబ్బోకవతి గన్న యాత్మజ యఁట,
మునికి లభియించెనఁట యాత్మజనని వీడ,
గళితమై నవ్యనవమాలికాసుమంబు
పరఁగ నర్కోర్వ్విజముమీఁదఁ బడినయట్లు.

విదూషకుఁడు:—(నవ్వి) ముద్దఖర్జూరము తినితిని వెగటుకొన్నవానికి, చింతకాయమీఁదికి మనస్సుపోవుట యెట్టిదో, అట్టిదిసుమా స్త్రీరత్నపరిభోగికి నీకు ఈమెయందు అభిలాషము జనించుట.

రాజు:—నీవు ఆ సుందరాంగిం జూడలేదు. అందువలన నిట్లనుచున్నావు.

విదూషకుఁడు:—నీకును విస్మయము ఆపాదించునట్టిది, రమణీయముగానే యుండవలయును.

రాజు:—వయస్యా, పెక్కుమాట లేల?

శా. ఆలేఖ్యమ్మున వ్రాసి దిద్ది యటపైఁ బ్రాణంబులన్ బోసెనో,
హేలన్ రూపచయమ్ము నేరిచి మనస్సృష్టిన్ దగన్ జేసెనో,
యాలోలేక్షణచెల్వమున్ విధివిభుత్వావాప్తియుం జూడ, నా
రీలోకాతిగ నాకుఁదోఁచు నపరస్త్రీరత్నసర్గంబుగాన్.

విదూషకుఁడు:—అట్లైన, రూపవతుల కందఱకు ఇపుడు ప్రత్యాదేశమే.

దుష్యంతుఁడు:—నా తలంపులోనున్న మాటఁ జెప్పెదను.

మ. వల పాఘ్రాతముకాని పూవు, నఖ సంస్పర్శంబులేనట్టి క్రొం
దలి, రస్వాదితసారమౌమధు, వవిద్ధంబైన రత్నంబుఁ, గో
మలిరూపం బనవద్యమున్ సుకృతసామగ్రీఫలం బౌర! నేఁ
దెలియన్ నేర విధాత యేని కది ప్రీతిన్ భోగ్యముం జేసెనో!

విదూషకుఁడు:—అట్లైన, నీవు ఆమెను త్వరగా పరిగ్రహింపుము. గారనూనెచేఁ జిక్కనైన తలవాఁడు, ఏ జడదారిచేతిలోనో పడిపోక ముందే.

దుష్యంతుఁడు:—ఆ కొంత స్వతంత్రురాలు కాదు. ఇప్పుడు గురుజనమును సన్నిహితముగా లేదు.

విదూషకుఁడు:—మఱి, నీమీఁద నామె కనురాగ మెట్టిదో?

రాజు:—తపస్వికన్యలు స్వభావముచేతనే అప్రగల్భలు. అట్లయ్యు

తే. నేఁ దనుంగనఁ దనచూడ్కినెఱి మరల్చు,
నవ్వు నొక్కింతఁ బెఱకారణమునఁ బోలె,
వినయవారితవృత్తిఁ గావించి మరుని
బయలుపఱుపదు, మఱియు దాఁపదు, లతాంగి.

విదూషకుఁడు:—అట్లుగాక, నిన్ను చూచినంతమాత్రాన వచ్చి నీ తొడమీఁదఁ గూర్చుండు ననుకొంటివా యేమి?

రాజు:—చెలులతోఁ గలసి వెడలిపోవునపుడు, వినయవతియయ్యు సుదతి తన హృదయము చక్కఁగా బయలుపఱిచినది.

చ. అరిగి యొకండు రెండడుగు లంఘ్రితలంబు కుశాంకురక్షతిన్
బొరసె నటంచు నయ్యలరుఁబోఁడి యకారణ మాఁగె నొంటిమై,
తరువిటపమ్ములన్ వలువ తార్కొనకున్న వదల్చికొంచు నా
హరిణవిలోలనేత్ర వదనాబ్జము ద్రిప్పి నను గనుంగొనెన్.

విదూషకుఁడు:—అట్లైనయెడల, గృహీతపాథేయుఁడవు కమ్ము. తెలిసిపోయినది. నీవు ఇప్పుడు ఈ తపోవనమును ఉద్యానవనము కావించుకొంటివి.

దుష్యంతుఁడు:—వయస్యా, ఇచ్చట దపస్వులు కొందఱు నన్ను గుఱితించిరి. మనము ఏనెపమున ఇంకొక్కతూరియైన ఈ ఆశ్రమమునకు రాఁగలమో యోజింపుము.

విదూషకుఁడు:—వేఱునెప మేల? నీవు రాజువుకదా!

దుష్యంతుఁడు:—ఆరణ్యకులు నీవారధాన్యమున ఆఱవపాలు మాకు అప్పగింపవలయు నను మిషపెట్టి యిటఁ బ్రవేశింపవచ్చును.

దుష్యంతుఁడు:—వయస్యా, ఈ తపస్వులను రక్షించుటవలన వేఱొకఫలము కలదు. అది రత్నరాసులకంటెను అధికమని యభినందింపఁదగినది సుమా, చూడుము.

ఆ. ప్రజలవలనఁ గలుగు ఫలమెద్ది యది యెల్ల
నతికాలమున క్షయమ్ము నొందు,
తగఁ దపస్విలిచ్చు తపము షడ్భాగ మ
క్షయ్య మగును జువ్వె జనపతులకు.

(తెరలో) ఆహా! కృతార్థుల మైతిమి.

దుష్యంతుఁడు.—(చెవియొగ్గి) అదే ధీరప్రశాంత స్వరము. తపస్వులు కాఁబోలు వచ్చుచున్నారు.

దౌవారికుఁడు.—(ప్రవేశించి) జయము జయము ఏలినవారికి, ఋషికుమారు లిరువురు ద్వారముకడ నిలిచియున్నారు.

దుష్యంతుఁడు:—వారిని వెంటనే లోనికిఁ దోడ్కొని రమ్ము.

దౌవారికుఁడు:—ఇదిగో, తోడ్కొనివచ్చెదను. (అని నిష్క్రమించి ఋషికుమారులతోఁ గూడఁ బ్రవేశించి) పూజ్యులారా, ఇటు, ఇటు.

(మునికుమారు లిరువురును రాజును విలోకింతురు.)

ప్రథముఁడు:—అహో, దీప్తిమంతమయ్యును ఎంత విశ్వసనీయముగా నున్నది యీ యాకారము. వింత యేమి? ఋషులనుండి యెక్కువ వేఱుపడని యీతనియం దిది ఉపపన్నమే.

ఉ. అందఱ కాశ్రయంబయిన యాశ్రమమం దితఁడుం డ్వసించుఁ, బృ
థ్విం దగఁ బ్రోచి యీతఁడును బెంచికొనుం దప మన్వహంబు; పె
ల్చం దివిదాఁకు నీ వశి యశమ్మును జారణదంపతుల్ రస
స్యందముగాఁగ రాజఋషిసంజ్ఞను నీతనిఁ గూర్చి పాడఁగాఁ.

ద్వితీయుఁడు:—గౌతమా! ఇతఁడేనా బలభిత్సఖుఁడు ఆదుష్యంతమహారాజు?

ప్రథముఁడు:—అవును.

ద్వితీయుఁడు:—అట్లైన

స్రగ్ధర. వారాశి శ్యామసీమన్ వసుమతిని బురప్రార్గళప్రాంశుబాహుం
డీరాజన్యుండొకండే యేలమితొలఁకఁ దానేలుటాశ్చర్యరంబా?
సౌరస్త్రైణంబు రక్షస్సమరముల బిడౌజఃపవిన్ మాని యేతత్
స్ఫారాధిజ్యోగ్ర బాణాసనమున జయముల్ సారెఁ గాంక్షించు
[చుండన్.

ఇరువురును.—(సమీపించి) రాజా! విజయివి కమ్ము.

దుష్యంతుఁడు.—(ఆసనమునుండి లేచి) మీకు అభివాదనము సేయుచున్నాను.

ఇరువురు.—నీకు స్వస్తియగుఁగాత. (అని ఫలములు కానుక యిచ్చుచున్నారు.)

రాజు:—(ప్రణామముతో గ్రహించి) ఆజ్ఞకు వేచియున్నాను.

ఇరువురు.—తమరు ఇచ్చట నున్కి గుఱిలించి ఆశ్రమవాసులు మిమ్ము ప్రార్థించు చున్నారు.

రాజు:—ఏమి యాజ్ఞాపించుచున్నారు?

ఇర్వురు:—పూజ్యులగు కణ్వమహర్షులవారు ఇపు డిచట లేనందున, రక్కసులు ఇష్టులకు విఘ్నము కావించుచున్నాను. కావునఁ దమరు సారథితోను, ఆయుధముల తోను కొన్ని రాత్రు లిటనుండి యాశ్రమము సనాథీకరింపుఁడని.

దుష్యంతుఁడు:—అనుగృహీతుఁడను.

విదూషకుఁడు.—(అపవారించి) ఋషుల యీ యభ్యర్థనము ఇప్పుడు అనుకూలముగానే యున్నది.

దుష్యంతుఁడు—రైవతక! మా మాటగాఁ జెప్పుము సారథితో; వింటితో బాణములతో రథము నిటకుఁ గొనితెమ్మని.

దౌవారికుఁడు:—ఏలినవారి యాజ్ఞ. (అని నిష్క్రమించును.)

ఇరువురు ఋషికుమారులు:—

తే. ఆది రాజన్యమార్గంబు ననుసరించు
ప్రభువునకు నీకు, యుక్తరూపమ్ము యిద్ది;
ఆర్తజనతాభయప్రదానైక సత్త్ర
దీక్షితులు కారె పౌరవాధీశు లెందు.

దుష్యంతుఁడు:—మీరు ముందు పోవుఁడు. నేనును మిమ్మనుపదము వెంబడించి వచ్చెదను.

ఉభయులు:—మహారాజ - విజయోస్తు. (అని నిష్క్రమింతురు.)

దుష్యంతుఁడు:—మాధవ్యా, నీకు శకుంతలను జూడవలయునను కౌతుకము లేదా?

విదూషకుఁడు:—మొదట కుతూహలము పెనువెల్లిగా పొఱలుచుండెనుగాని, రాక్షస వృత్తాంత శ్రవణముచే, అందు ఒక్క చుక్కైనను ఇపుడు మిగిలియుండలేదు.

దుష్యంతుఁడు:—భయపడకుము. నీవు నా దండనే యుందువుకదా!

విదూషకుఁడు:—ఇపుడు రాక్షసులనుండి రక్షితుఁడ నైతిని.

దౌవారికుఁడు:—(ప్రవేశించి) ఏలినవారికి జయము. తేరు ఆయితమై ప్రభువుల విజయ ప్రస్థానము నపేక్షించుచున్నది. మఱి రాజధానినుండి అమ్మగారి యాజ్ఞను గొని వచ్చి యున్నాఁడు. వీఁడుగో కరభకుఁడు.

దుష్యంతుఁడు:—(సాదరముగా) మాతృశ్రీగారు పంపిరా యేమి?

దౌవారికుఁడు:—చిత్తము.

దుష్యంతుఁడు:—రమ్మను మాతనిని.

దౌవారికుఁడు:—చిత్తము. (అని నిష్క్రమించి) (కరభకునితోఁ బ్రవేశించి) వారుగో ఏలినవారు. దగ్గఱకుఁ బొమ్ము.

కరభకుఁడు:—(సమీపించి) జయము జయము, ఏలినవారికి. అమ్మగారు సెలవిచ్చి నారు. నేఁటికి నాల్గవనాఁడు పారణ సేయఁదగిన ఉపవాసవ్రత మొకటి మేము తలపెట్టియున్నాము. నాఁటికి చిరంజీవులు తప్పక రావలయును-అని.

దుష్యంతుఁడు:—ఇట తపస్వికార్యము; అట గురుజనాజ్ఞ. రెండును అతిక్రమింప రానివే. ఇపుడు ఏమి సేయవలయును?

విదూషకుఁడు:—త్రిశంకువువలె నడుమ వ్రేలాడుచుండుము.

దుష్యంతుఁడు:—పరిహాసమునకు సమయము కాదు. వయస్యా! నేను నిజముగా వ్యాకులపడుచున్నాను.

తే. కార్యములు రెండు వేర్వేఱ కడలనున్కి-
నెంద మిపుడు ద్వైధీభావ మందుచున్న,
దెదుటను శిలోచ్చయనిరోధ మెనసినట్టి
యలఘుకల్లోలినీప్రవాహంబువోలె.

(ఆలోచించి).—సఖా, నీవు అమ్మగారిచే పుత్త్రుఁడవుగా ప్రతిగ్రహింపఁబడి యున్నావు. కావున, నీవు తరలిపోయి, ఇచ్చట నేను నిర్వహింపవలసియున్న తపస్వికార్యము నివేదించి, అమ్మగారికి పుత్త్రకృత్యము నీవు నెఱవేర్పుము.

విదూషకుఁడు:—నేను రక్కసులకు వెఱచి పోవుచుంటి ననుకొందువా యేమి?

దుష్యంతుఁడు:—మహాబ్రాహ్మణుఁడవు, నీకును భయమా?

విదూషకుఁడు:—అట్లైన రాజుతమ్ముఁడు ఎట్లుపోఁదగునో అట్లే పోయెదను.

దుష్యంతుఁడు:—తపోవనమునకు ఉపద్రవముకలుగకుండునట్లు పరిజనము నెల్ల నీ వెంటఁ బంపెదను.

విదూషకుఁడు:—అట్లైన, నే నిప్పుడు యువరాజు నైతిని.

దుష్యంతుఁడు—(ఆత్మగతము) ఇతఁడు చపలుఁడు. ఇచటి నా వృత్తాంతమును అవివేకమున అంతఃపురములోఁ జెప్పినను చెప్పును. కాన, ఈతనితో ఇటు వచించెదను. (విదూషకుని హస్తముపట్టుకొని)-(ప్రకాశము) వయస్యా! మహర్షులయందలి గౌరవముచేత ఆశ్రమమున కరుగుచున్నాను. కాని తపస్వి కన్యయగు శకుంతలమీఁద నా కభిలాషము సత్యము కాదు సుమా.

క. ఏమేఁడ? పరోక్షస్మర
మైె మృగములతోడఁ బెరుఁగు నాచెలి యేడ్ఁగా?
ఏమో నవ్వులకాడిన
యా మాటలు, సఖుఁడ! తథ్యమని యెంచకుమా!

(అని యందఱు నిష్క్రమింతురు.)



*

# తృతీయాంకము — శుద్ధవిష్కంభము

——:o:——

## స్థలము : I – మాలినీతీరము.

[అంత యజమానశిష్యుఁడు చేత దర్భ గొని ప్రవేశించును.]

శిష్యుఁడు:—ఆహా! మహానుభావుఁడుకదా దుష్యంతమహారాజు. ఈతఁడు ఆశ్రమపదము చొచ్చిన మాత్రమున, మా కర్మానుష్ఠానములు నిరుపప్లవములైనవి.

తే. విశిఖసంధానకృతి నేల పేర్కొనంగ
నతఁడు విలుహుంకృతింబోని జ్యాసముత్థ
టంకృతిన దూరముననె యడంచివైచు
సంయముల దారుకొను విఘ్నసముదయముల.

వేదికమీఁదఁ బఱుచుటకు, ఈ దర్భల ఋత్విక్కుల కందించెదను.
(పరిక్రమించి చూచి) – (ఆకాశమున)

ప్రియంవదా! ఎవరికోసమే ఈ వట్టివేళ్లగంధము, మృణాళములతోఁ గూడిన యీ నళినీపత్త్రములు తీసికొనిపోవుచున్నావు? (శ్రుతి నభినయించి) ఏమనుచున్నావు? ఎండతాఁకునకు శకుంతల మిగుల అస్వస్థగానున్నది. ఆమె మేని కాక నపనయింపఁజేయుటకు అనియా! అట్లైన, మీమీ పనికిఁ దొడంగుఁడు. ఆమె కులపతులకు ప్రాణమువంటిది కదా! నేనును, శాంతిజలమును వైతానికమును గౌతమిచేత నచ్చటికిఁ బంపెదను. (అని నిష్క్రమించును.)

## స్థలము – II

[అంత, కామయమానావస్థుఁడు రాజు ప్రవేశించుచున్నాఁడు.]

దుష్యంతుఁడు:—

ఆ. ఎఱుఁగుదును తపస్సమిద్ధ మహత్త్వమ్ము,
అబల యస్వతంత్ర యని యెఱుఁగుదు,
ఐన నాదు హృదయ మబ్జాక్షికడనుండి
యెడిచికొనఁగ నేరకున్నవాఁడ.

(మదనబాధ నభినయించుచు) మహాత్మా! కుసుమాయుధా! నీవును, చందురుఁడును కామిజనుల నమ్మించి, వంచించుచున్నారు కదా! ఎందువల్ల ననఁగా,

ఉ. నీ సుమనశ్శరత్వమును నీరజవైరి సుధాకరత్వముఁ
భాసిలు రెండు మాదృశులపట్లఁ గరం బయథార్థగాథలై;
యాసరసీరుహారి మిహికాంశులఁ జిచ్చులఁ గ్రుమ్మరించెడుఁ,
జేసెదు వజ్రసారముల నీవును నీనును పూవుటమ్ములఁ.

పూజ్యుఁడవగు నో కామదేవుఁడా, నీకు నాయందుఁ గనికరము లేదా? (మదనబాధ నభినయించి) పుష్పాయుధుఁడవగు నీకు ఇంత వాఁడిమి యెట్లు కలిగినదయ్యా? హా! తెలిసినది.

ఆ. ఆజి దిప్పటికిని హరకోపవహ్ని నీ
యందు, నౌర్వ మబ్ధియందుఁ బోలెఁ
గాకయున్న మార! గ్రాతుమ మ్మెట్లు భ
స్మావశేష మైనయట్టి నీవు?

కాని,

క. మదనుండు రేయిఁబగలుఁ
హృదయవ్యథ సేయుచున్న నిష్టుఁడ నాకుఁ
మదిరాయతాక్షి యగు నా
ముదిత నిమిత్తంబె నన్ను మొత్తెపుఁ గానఁ.

భగవంతుఁడవగు కందర్పుఁడా! ఇట్టి యుపాలంభనమునకైన నీకు మాయెడ కరుణ కలుగుట లేదా?

క. నినుఁ బెంచి పెద్ద చేసితి
ననంగ! సంకల్ప శతసహస్రమ్ములఁ గా
వున నీకు యుక్తమే, చెవి
దనుకఁ విలులాగి బాణతతి నను నొంపఁ.

(ఖేదముతోఁ బరిక్రమించి) యజ్ఞకర్మ పూర్తియై, సదస్యులచేతఁ బోవ ననుజ్ఞాతుఁడనైతినికదా! క్లాంతమైన నాస్వాంతమును ఇప్పుడెట్లు వినోదింపఁ జేయుదును? (నిశ్వసించి) దయితాదర్శనమునకన్న నాకు వేఱు శరణ్యము లేదుకదా! కావున దయితనే వెదకెదను. (సూర్యుని జూచి) ఇట్టి మండు టెండలలో, ప్రాయికముగా శకుంతల చెలికత్తెలతోఁ గూడి లతావలయములు గల మాలినీతీరములయందుఁ బ్రొద్దుపుచ్చుచుండును. నేను నక్కడికే పోయెదను. (పరిక్రమించి చూచి) ఈ గున్నచెట్లున్నబాటను, శకుంతల యిప్పుడే పోయినదని నేనూహించెదను.

ఆ॥ పూలుగోసె నిచటఁ బూఁబోఁడి యిప్పుడే
ముడుచుకొనవు వృంతములు రవంత;
సుదతి చిగురు లిచటఁ జిదిమె, గిల్లినచోట్లు
పాలు వడయుచున్న వోలి నిపుడు.

(పరిక్రమించి - స్పర్శసుఖ మభినయించి) ఓహో! ఈ ప్రదేశము సుకుమార శిశిరానిలములచే నెంత సుభగముగా నున్నది.

ఆ. కమలసౌరభమ్ముఁ దమిఁ గొల్లలాడి, మా
లిని తరంగబిందులను వహించి
మలయు నిచటిగాలి స్మరతప్తమగు మదం
గములఁ గౌఁగిలింపఁ గాంక్ష నాకు.

(పరిక్రమించి చూచి) వేతసావృతమైన యీ లతామండపమున శకుంతల యుండితీఱును.

క. మునుకడఁ గడు నున్నతమున్
వెనుకన్ గటిభరముకతన నిమ్నమ్మునునై
కనఁబడు నిదె సితసికతా
వని నూత్నము చరణసరణి ద్వారమ్మునకడన్.

నే నీ కొమ్మలమాటుననుండి చూచెదను. (పరిక్రమించి చూచి) అహో! నా నేత్రములకు నేఁటికి సాఫల్యము కలిగినది. ఇదె నా మనోరథప్రియతమ, పూలుపఱిచిన యీ శిలాపట్టమున శయనించి యున్నది. చెలికత్తె లిరువురు ప్రక్కనే యున్నారు. ఇటనుండియే వీరి విస్రంభభాషణముల నాలించెదను.

(చూచుచు నిలుచుండును.)

స్థలము - III అచటనే వేతసగృహము.

[అంత, చెలులతోఁ గూడ శకుంతల యథానిర్దిష్టవ్యాపారమునఁ ప్రవేశించును.]

సఖులు:—(వీవనతో వీచి) సఖీ, శకుంతలా! నీకీ తామరపాకుగాలి సుఖముగా నున్నదా?

శకుంతల:—ఏమీ, మీరు నాకు విసరుచున్నారా?

సఖులు:—(విషాదము నటించి యొండొరులఁ జూచుకొనుచున్నారు.)

రాజు:—ఈ యబల మిగుల నస్వస్థగాఁ గానవచ్చుచున్నది. దీనికిఁ గారణము ఎండవలని తాపమా! గాక వలతేని ప్రతాపమా! గాక రెండునా! సందేహ మేల? ఇది కందర్పుని కడిమియే.

మ. వదులై జాఱు బిసైక కంకణముతో, వక్షోరుహాన్యస్త చం
చదుశీరమ్ములతో, లతాంగిమెయి కార్శ్యంబందియుఁ శోభిలుఁ
మదనుండో, మఱి గ్రీష్మమో కతము సంతాపాప్తికిఁ; గాని త
ప్పిద మీ దృక్సుభగం బొనర్పఁగలదే వేసంగి తన్వంగికిఁ.

ప్రియంవద:—(జనాంతికము) అనసూయా! ఆ రాజర్షి తొలి దర్శనము తొడఁగి శకుంతల పర్యుత్సుకయై యాపన్నవలె నున్నది. ఈ సంతాపము తన్నిమిత్తము గానే యుండునా?

అనసూయ:—(జనాంతికము) సఖీ! నాకును మనసులో నిట్టి శంకయే కలదు. కానీ, చెలినే యడిగిచూచెద. (ప్రకాశము) చెలీ! నిన్నొకటి యడుగవలసియున్నది. నీ సంతాపము అగ్గలముగా నున్నది సుమా.

శకుంతల:—(పూసెజ్జనుండి సగములేచి) సఖీ! యేమడుగఁ దలఁచితివి?

అనసూయ:—సఖీ! శకుంతలా! వలతేనిపాలకువలు మాకుఁ దెలియవుగదా? ఇతిహాస నిబంధనములలో వలపుగొన్నవారి యవస్థ యెట్టిదిగా విందుమో అట్టిది నీయందుఁ గానవచ్చుచున్నది. సఖీ! నీకు ఈ యాయాస మెందువలననో చెప్పుము. కారణము సరిగాఁ దెలిసికొనిగదా పరిహారమునకుఁ గడఁగవలయును.

దుష్యంతుఁడు:—నా యూహయే అనసూయకును గలిగినది. ఈ యభిప్రాయము నే ననుకొన్నదిమాత్రమే కాదు.

శకుంతల:—(ఆత్మగతము) వీరితోఁ జెప్పుటకును నాకు లజ్జయగుచున్నది. వెంటనే చెప్ప నేరకున్నాను.

ప్రియంవద:—సఖీ! అనసూయ చక్కఁగాఁ జెప్పినది. ఏల నీ స్థితిని నీవు ఉపేక్షించుచున్నావు? నానాఁటికి నీ యంగములు కృశించిపోవుచున్నవి. ఒక్క లావణ్యచ్ఛాయమాత్రము నిన్ను వదలలేకున్నది.

రాజు:—ఉన్నమాటయే యన్నది ప్రియంవద. అట్లగదా,

మ. ద్యుతిఁగోల్పోయెఁగపోలముల్; నెఱిబిగిఁ దూలెఁ జనుల్; కృస్సెఁగౌ
నతినమ్రమ్ములు మూఁపు, లంగములు తెల్పయ్యెఁ, స్మరక్లిష్ట యీ
శతపత్రేక్షణ పత్రశోషణమరుత్సంస్పర్శయుఙ్మాధవీ
లత నా శోచ్యయు దర్శనీయయునునై లక్ష్యంబగుఁ జూడ్కికిఁ.

శకుంతల:—(సిగ్గుతో) సఖీ! మీతోఁగాక మఱియెవ్వరితోఁ జెప్పుదును. కాని, అందువలన మీకును ఆయాసము కలిగించినదాన నగుదును.

ఇర్వురు:—అందుకనియే నిర్బంధించి యడుగుచున్నాము. నెయ్యురతోఁ బంచుకొన్నప్పుడుగదా దుస్సహమైన దుఃఖమును సుసహమగును.

రాజు:—

చ. సమసుఖదుఃఖలౌ చెలులు సారెకు వేఁడుటఁ జేసి బాల చి
త్తమునుగలంచు నెవ్వగ కతమ్మును దాఁపక తెల్పు నియ్యెడన్;
రమణి మొగమ్ముద్రిప్పి యనురక్తి ననుం గనె నాఁడుసారె, నై
న మగువ పల్కులోన శ్రవణంబిది తత్తఱపాటుఁ జెందెడున్.

శకుంతల:—సఖీ! తపోవనరక్షణార్థము వచ్చిన యా రాజర్షిని ఏనాఁడు (లజ్జతో) నా కంటఁ జూచితినో (అని సగములో లజ్జ నభినయించును.)

సఖులు:—చెప్పుము. సఖీ! చెప్పుము.

శకుంతల:—నాఁటఁగోలె ఆయనయందలి వలపుచే ఈ యవస్థకు అగ్గమైతిని.

రాజు:—(హర్షముతో) వినఁదగినది వింటిని.

క. తాపమ్ముఁ గూర్ప, మఱి త
త్తాపమ్మునుదీర్ప, నా కతనుఁడే యయ్యెన్;
రూపింప ఘనశ్యామం
బౌ పగలు జనాళికిన్ దపాంతమున వలెన్.

శకుంతల:—కావున, నిది మీ కభిమతమేని ఆ రాజర్షి కనికరమున కెట్లు పాత్రమగుదునో అట్లు కావింపుఁడు. కాకున్న నాకు జలాంజలి విడువుఁడు.

రాజు:—ఈ మాట సందేహముం దూరీకరించుచున్నది.

ప్రియంవద:—(జనాంతికము) అనసూయా! చెలికి మదనబాధ వెగ్గలముగానున్నది. విలంబము నోర్చునది కాదు. ఈమె ప్రేమించినవాఁడు పౌరవకుల లలామ భూతుఁడు. కావున ఈమె కోర్కె అభినందింపఁ దగినదే.

అనసూయ:—(జనాంతికము) చక్కఁగాఁ జెప్పితివి. (ప్రకాశము) అదృష్టవశమున సఖీ! నీకుఁ గలిగిన యనురాగప్రకర్షము అనురూపమైనదే. రత్నాకరమును వదలి మహానది యెందుఁ జేరును!

ప్రియంవద:—చిగిర్చిన మాధవీలత తీయమావికిఁదప్ప, దేనికిఁ దగును?

రాజు:—విశాఖలు శశాంకరేఖ ననువర్తించుటలో వింత యేమి?

అనసూయ:—సఖీ! మనోరథమును శీఘ్రముగాను రహస్యముగాను నెఱవేర్చుట కిప్పు డేది యుపాయము?

ప్రియంవద:—శీఘ్రముగా నెఱవేర్చుట సుకరమే. రహస్యముగా నన్నదే చింత కొడమిచ్చుచున్నది.

అనసూయ:—ఎట్లు?

ప్రియంవద:—ఆ రాజర్షి తన నిద్దపుఁ జూడ్కులచే నపుడు నెచ్చెలియందలి యభిలాష మగపఱిచియే యున్నాఁడు. పైఁగా దినదినమునకుఁ బ్రజాగరకృశుఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు.

రాజు:—[తన్నుఁజూచుకొని] ప్రియంవద సత్యమే చెప్పినది.

చ. భుజము తలాడగా నిశలు పుచ్చునెడన్ గడకంటనొల్కు బా
ష్పజలము వేఁడిమిన్ మసకవాఱిన రత్నపుఁ బైఁడికంకణం
బు జరిగి జ్యాకిణాంకమగు ముంజెయి యడ్డెడుదాఁక జాఱఁగా
ఋజుగతి మాటిమాటికిని నేనది పైకెగఁద్రోయుచుండుదున్.

ప్రియంవద:—(ఆలోచించి) నెచ్చెలి యొకవలపుజాబు వ్రాయుఁగాక. దానిం బూవులలోఁ బొదివి, దేవతాప్రసాదవ్యాజమున నాతనిచేతి కందించెదను.

అనసూయ:— ఈ సుకుమారోపాయము నాకును రుచించుచున్నది. శకుంతల యేమనునో?

శకుంతల:—మీ మాటకు వేఱుచెప్పుదునా?

ప్రియంవద:—అట్లైన, నీ స్థితిని తేనికి తెలియఁబఱచు నొక లలితపదబంధము యోజింపుము.

శకుంతల:—అట్లే యోజించెదను, కాని అవధీరణభయముచే నా హృదయము వడఁకొడుచున్నది.

రాజు:—(ఆత్మగతము)

తే. అవమతిఁ దలంచి శంకింతు వెవనివలన
అతఁ డితఁడె ప్రేమోలఁ ద్వత్సంగమార్థి బేల!
ప్రార్థయిత శ్రీని బడయును బడయకుండు
సిరియ కోరిన నతఁడు చేకుఱమి గలదె?

ప్రియంవద:—ఓసీ, ఆత్మగుణావమానినీ! మేనితాపము పోఁజోపు శరత్కాల జ్యోత్స్నను ఎవ్వఁడు వస్త్రాంచలమున వారించుకొనును?

శకుంతల:—(చిఱునగవుతో) సరే. మీ యిష్టము. (కూర్చుండి యోజించును.)

రాజు:—(విస్మృత నిమేషములైన చక్షువులతో) ప్రియురాలిఁ జూచుట కిదే సమయము.

తే. పదముల రచించుచున్న యీ పక్ష్మలాక్షి
కనుబొమ యొకండు పైకిఁ జాఁగిన ముఖమ్ము,
లలిత పులకాంకురిత కపోలములచేత
చెలికి నాపైఁగల విరాళి వెలువరించు.

శకుంతల:—సఖులారా! గీతిక నాలోచించితిని. లేఖనసాధనములు దగ్గఱ లేవే.

ప్రియంవద:—ఇదే శుకోదరసుకుమారము నళినీపత్త్రము. గోనగోళ్లచే గీతిక నిందు లిఖింపుము.

శకుంతల:—(అట్లే చేసి) చెలులారా! వినుండు. అర్థము పొసఁగియున్నదో లేదో చూడుఁడు.

ఉభయులు:—సావధానలమై యున్నాము.

శకుంతల:—(చదువుచున్నది)

క. ఎఱుఁగను నీ హృదయము, ని
ష్కరుణుఁడ! మదనుం డహర్నిశము వేచెడి మ
చ్ఛరమార, నీయెడఁగల సు
స్థిరాభిలాషమ్ము లామదీయాంగములన్.

రాజు:—(వేగముగా సమీపించి)

క. నిను వేఁచుఁగాని మదనుఁడు
నను మాత్రము రేయి పవ లనక దహియించున్
దనుగాత్రి! దివస మేణాం
కునిఁబోలె గలంచు నొక్కొ కుముదిని నెందున్.

ఇరువురు:—(చూచి హర్షముతో) అవిలంబిత ప్రాప్తమనోరథమునకు స్వాగతము.

(శకుంతల రాజుంగని లేవఁబోవును.)

రాజు:—వలదు. వలదు. ఉపచారము వలదు.

తే. అతిమృదిత నవ్యకుసుమ శయ్యాతలములు
సరభస క్లాంత బిసభంగ సురభిళమ్ము
లలఘు పరితాపములు తావకాంగకములు
రమణి! యుపచారమున కనర్హములు సుమ్ము.

అనసూయ :— ప్రియవయస్యుఁడు ఈ శిలాతలైకదేశము ననుగ్రహించుఁ గాక

(దుష్యంతుఁడు కూర్చుండును. శకుంతల లజ్జతో నిలఁబడును.)

ప్రియంవద:—మీ యిర్వుర కొండొరులమీఁది యనురాగము ప్రత్యక్షము. ఐనను నెచ్చెలియందలి నెయ్యముచే నే నొక్కమాట మరలఁ జెప్పఁగోరుచున్నాను.

రాజు:—అవశ్యము చెప్పుము. అనుకొన్నదానిం జెప్పకున్న అది వెనుక అనుతాపమునకు హేతువగును.

ప్రియంవద·—ఆపన్నులగు స్వదేశజనుల యార్తిఁ దొలంచుటయేకదా రాజులకు మీకు ధర్మము.

రాజు:—అంతకంటె వే ఱేమున్నది?

ప్రియంవద:—ఈ మా ప్రియసఖి నిన్నుద్దేశించియే భగవానుఁడగు మన్మథునిచే ఈ యవస్థ పొందింపఁబడినది. కావున, ఆమె జీవితము దయయుంచి కాపాడవలసినది నీవే సుమా.

రాజు:—కల్యాణీ! ఈ ప్రార్థన మా యిద్దఱకుఁ దుల్యమే. సర్వథా అనుగ్రహింపఁబడినవాఁడ నైతిని.

శకుంతల:—(ప్రియంవదను జూచి) సఖీ! అంతఃపురవిరహపర్యుత్సుకుని రాజర్షి నేల ఉపరోధించెదవు?

రాజు:—

తే. అనితర పరాయణమ్ము దీనిని మదాత్మ
నాత్మ సన్నిహితవు నీవె యన్యరీతి
మదిని భావించె దేనియు, మదిరనయన!
స్మరశర హతుండనయ్యుఁ, గ్రమ్మఱ హతుండ.

అనసూయ:—వయస్యా! రాజులు పెక్కండ్రఁ బ్రియురాండ్రఁ బరిగ్రహింతురని వినికి. మా కూర్మిచెలి బంధుజన శోచనీయ కాకుండునట్లు ఆచరింపుము.

రాజు:—కల్యాణీ! పలు పలుకు లేల?

ఆ. బహుపరిగ్రహములు వఱలుచున్నను మాకు
నన్వయ ప్రతిష్ఠ కగును రెండె,
వార్ధిరశన యైన వసుధయో ర్తయు మీ య
నుంగుచెలి యీ లతాంగి యొర్తు.

ఇర్వురు:—మిక్కిలి సంతోషము.

ప్రియంవద:—(చూపు సారించి) అనసూయా, ఇదిగో ఈ లేడిపిల్ల దిగులుపడి ఇటు నటు చూచుచు తల్లిని వెదకుచున్నది. దానిని తల్లితోఁ గూర్తము రమ్ము.

(ఇరువురు వెడలుదురు.)

శకుంతల:—సఖులారా! నన్నొంటిగా విడిచిపెట్టి పోయెదరా? మీలో ఒకరు ఇటు రండు.

ఇరువురు:—ఒంటరివా? పృథివి కెల్ల నెవరు శరణమో ఆతఁడే నీచెంత నుండఁగా.

(అని నిష్క్రమింతురు.)

శకుంతల:—ఏమీ, పోనే పోయిరి.

రాజు:—ఏల యీ ఉత్తలపాటు ప్రియా! ఉపచారము సేయు జనుఁడు నీ సమీపముననే ఉన్నాఁడుకదా!

తరల. తనుపు సేయు సరోజినీదళ తాళవృంతము చేఁ గ్లమం
బును దొలంచెడు శీతలానిలముల్ చలింపఁగఁ జేయనా?
అనుప మోరువ! గాక నీకుఁ బ్రియంబుగా భవ దంఘ్రులన్
వనజ తామ్రములన్ దొడంగొని పాణి నొత్తుదునా తమిన్?

శకుంతల:—మాననీయులయెడ నపరాధము సేయను. (అని లేచి పోఁబోవుచున్నది.)

రాజు:—సుందరీ! ఎండవేండ్రమింకను తగ్గలేదు. నీ యవస్థయు నిట్లున్నది.

ఆ. విరులసెజ్జ వీడి సరసిజదళ కల్పి
తస్తనావరణము తలఁగఁద్రోసి
యాతపమున నేల యరిగెదింతిరో! వ్యథా
కలిత పేశలాంగకములతోడ.

(అని యామెను బలత్కారమున మరల్చును.)

శకుంతల:—పౌరవా! ధర్మమును గాపాడుము. వలతేనిచేతఁ జిక్కినను నేను పెద్దలచాటున నున్నదానను జుమా.

రాజు:—బేలా! గురుజనులవలని భయమేల? సువిదిత ధర్ముఁడు పూజ్యుఁడు, కులపతి విన్నను దీనిం దప్పుగా నెన్నఁడు. చూడుము.

క. రాజర్షి కన్య లెందఱో
పూజిత గాంధర్వవిధి విభులఁ బెండిలిరై
రాజిలి రనియున్ బితల
య్యోజన్ గొనియాడి రనియు యువతిరో! వినమే?

శకుంతల:—ఆర్యా! ఇప్పటికి నన్ను విడువుము. మరల సఖీజనుల యనుమతింగొని వచ్చెదను.

రాజు:—అట్లే విడిచెదను.

శకుంతల:—ఎప్పుడు?

రాజు:— తే. అమల మపరిక్షతము కోమలమును నైన
ప్రసవమందు మరందంబు భ్రమర మట్టు
లలఘు తృష కొంత దీఱ నీ యధరసుధను
సదయముగఁ గ్రోలి పిదప వీడెద, లతాంగి.

(అని యామెముఖము నెత్తఁబోవును. శకుంతల నాట్యముచేఁ బరిహరించును.)

(తెరలో)

చక్రవాకవధూటీ, సహచరుని వీడ్కొనుము. రాత్రి దగ్గఱుచున్నది.

శకుంతల:—(చెవియొగ్గి తత్తఱముతో) పౌరవ! నిజముగా ఆర్యగౌతమి యిటు వచ్చుచున్నది, నా శరీరవృత్తాంతము స్వయ మరయుటకు. కావున కొమ్మల చాటునకుఁ బొమ్ము. (రాజు అట్లే దాఁగుకొని యుండును.)

(అంత పాత్రహస్త తాపసియు సఖులును ప్రవేశింతురు.)

సఖులు:—ఇటు ఇటు.

గౌతమి:—(శకుంతలను డాసి) కుమారీ! నీ మేనితాపము తగ్గినదా?

శకుంతల:—ఇప్పుడు ఇంచుక మేలుగా నున్నది.

గౌతమి:—మంత్రించిన ఈ దర్భోదకముచేత నీ శరీరబాధ నిశ్శేషము కాఁగలదు. (శకుంతల శిరముమీఁద జలముచల్లి) అమ్మాయీ! ప్రొద్దు వ్రాలుచున్నది. పర్ణశాలకు పోదము రమ్ము.

శకుంతల:—(ఆత్మగతము) హృదయమా......తొలుత మనోరథము సులభముగా సిద్ధించినపుడు, నీ పిఱికితనము మానవైతివి. ఇప్పుడు అది విఘటితముకాఁగా పశ్చాత్తాపపడి యేమి ప్రయోజనము? (ఒక యడుగు నడచి నిలిచి)

(ప్రకాశముగా) సంతాపహరమైన యో లతానిలయమా! ఇప్పటికి నిన్ను వీడ్కొనుచున్నాను. పరిభోగముకొఱకు నిన్ను మరలఁ గలసికొనియెదను.

(దుఃఖదుఃఖముగాఁ జెలులతోఁగూడి నిష్క్రమించును.)

రాజు:—(మొదటి తావునకు వచ్చి నిట్టూర్పువిడిచి) ఔరా! అంతరాయములు తప్పవు కదా అభీప్సిత కార్యసిద్ధికి. నేను,

చ. లలితపు టంగుళీకిసముల౯ బెదవి౯ బలుమాఱు కప్పుచు౯,
వలవ దటన్నవర్ణముల వైఖరి విక్లబత౯ బ్రియమ్ముగా,
జలజదళాక్షి, తా బుజము చక్కికిఁ ద్రిప్పిన మోము, నెట్లొ య
ర్మిలిఁ బయికెత్తియు౯ దమి శమింపఁగ ముద్దిడనైతి, నక్కటా!

ఇపు డెచటి కేఁగుదును? కానీ ప్రియాపరిభుక్తముక్తమైన ఈలతామంటపము నందే ముహూర్తమాత్రము నిలిచెదను. (అంతటఁ గలయం గని)

మ. ఇదె పూసెజ్జ శిలాస్థలి౯, గమలిపోయె౯ దన్వి మైసోఁకి; యి
య్యదె గోట౯ నళినీదళి౯ జెలియ వ్రాయ౯ మ్లానమా ప్రేమజా,
బిదె హస్తచ్యుత తద్బిసాభరణమం చెంతేఁ దమి౯ గాంచుచు౯
వదల౯ నేర రయమ్ము శూన్యమయియున్న౯ వేత సాగారము౯.

(తెరలో)

రాజా:—

తే. సవనకర్మమ్ము కడసంజ సాగుచుండ
హుతవహోజ్జ్వల వేదిచుట్టుగ్రలీల
నలఘు పిశితాశనచ్ఛాయ లొలసి తిరుగు
సాంద్రసంధ్యాబ్దధూమల చ్ఛవులతోడ.

రాజు:—(విని) ఇదిగో వచ్చితిని. (అని నిష్క్రమించును.)

విష్కంభము

[స్థలము - కణ్వాశ్రమము—పర్ణశాలచెంతఁ బూవుఁదోఁట]

(అంత పూలుగోయుట నభినయించుచు సఖులు ప్రవేశింతురు.)

అనసూయ:—సఖీ! ప్రియంవదా! గాంధర్వవిధిచేత శకుంతల అనురూపుఁ డగు భర్తను జేపట్టినందుకు సంతోషమే కాని, మనము ఇప్పుడు ఒకటి యాలోచింపవలసి యున్నది.

ప్రియంవద:—ఏమది?

అనసూయ:—ఇష్టి పూర్తిచేసి, ఋషులచే ననుజ్ఞాతుఁడై రాజధాని కరిగి అంతఃపురగతుఁడైనపిదప ఆరాజర్షి ఇచ్చటివృత్తాంతము స్మరించునో, స్మరింపఁడో అని.

ప్రియంవద:—సంశయింపకుము. అట్టి యాకృతివిశేషములు గుణవిరోధులు కానేరవు. మఱి నాయనగారు ఈవృత్తాంతము విని యేమందురో కదా!

అనసూయ:—ఇది నాయనగారి కభిమతమనియే నా తలంపు.

ప్రియంవద:—ఎట్లు ?

అనసూయ:—నాయనగారికి శకుంతల నెవ్వనికేని గుణవంతున కీయవలయుననియే కదా ప్రథమమైన సంకల్పము. దైవవశమునన యది చేకూరినపుడు బహుళా యాసము లేకయే కృతార్థముగదా గురుజనము.

ప్రియంవద:—(పూలపుటికఁ జూచి) సఖీ, ఈ కోసినపూలు బలికర్మకుం జాలునుకదా.

అనసూయ:—శకుంతల సౌభాగ్యదేవతను అర్చింపవలసియుండలేదా?

ప్రియంవద:—అవును వాస్తవమే. (అని మరలఁ బువ్వులుకోయఁ దొడంగుదురు.)

(తెరలో)

ఎవరక్కడ? ఇదిగో నేను వచ్చియున్నాను.

అనసూయ:—ఎవరో అతిథులమాటగా నున్నది.

ప్రియంవద:—పర్ణశాలలో శకుంతల ఉన్నదికదా !

అనసూయ.—ఉన్నది కాని దాని మనస్సు అచ్చట లేదు.

ప్రియంవద:—ఈ పూలు చాలును. పోదము పద. (అని బయలుదేఱుదురు.)

(తెరలో)

హా! అతిథి పరిభావినీ!

పృథ్వి. తదేకగతి నెవ్వనిన్ దలఁచు చీవు నేదిష్ఠు నన్
ప్రదీపిత తపోన్వితున్ గనకయుంటి వాతం డిటే
మదిం దెలియకుండుఁబో మగువ! బోధితుండయ్యు నిన్
మదోత్కటుఁడు తాను మున్ పలికినట్టి పల్కుంబలెన్.

అనసూయ:—అయ్యో! అయ్యో! అనుకొన్నట్లే అయినది. పూజార్హుఁడైన యెవరి పట్లనో అపరాధ మొనర్చినది - శూన్యహృదయ శకుంతల. (మరలఁ జూచి) వారి వీరి పట్లఁ గాదే. సులభకోపుఁడు మహర్షి దుర్వాసునిపట్లనే గావించినది అపరాధము. అట్లు శపించి వారింపరాని కడిఁది నడకతో వడివడిగా పోవు చున్నాఁడు. అగ్ని కాక మఱియేది దహింపఁగలదు? నీవు పోయి పాదములకు ప్రణమిల్లి మహర్షిని మరలింపుము. ఈలోన నేను అర్ఘ్యోదకము కొని కలసికొనెదను.

ప్రియంవద:—అట్లే. (అని నిష్క్రమించును.)

అనసూయ:—(అడుగుపెట్టి తడఁబాటు నభినయించి) అయ్యో! పోవువడిలో కాళ్లు తడఁబడి చేతినుండి జాతి పూలబుట్ట క్రిందఁబడినది. (అని పూల నేఱును.)

ప్రియంవద:—(ప్రవేశించి) స్వభావముచేతనే కుటిలుఁడు. అతఁడు ఎవ్వరి వేఁడికోలు పాటించును? ఐనను చెలిపై ఇంచుక దయఁ జూపినాఁడు.

అనసూయ:—(చిఱునవ్వుతో) ఆ పాటియే అతనియందు గొప్ప. 'ఏమన్నాఁడు' చెప్పుము. చెప్పుము.

ప్రియంవద:—నే నెంత వేఁడుకొన్నను, అతఁడు మరలలేదు. అప్పుడు నే నిట్లు విన్నవించుకొంటిని.

అనసూయ:—ఏమని ?

ప్రియంవద:—స్వామీ! తొల్లిటి భక్తిఁ దలఁచి తమ ప్రభావ మెఱుఁగక ఈ కుమారి గావించిన యేకైకాపరాధము భగవంతులు క్షమింపవలయును – అని.

అనసూయ:—ఆవల?

ప్రియంవద:—అంత నతఁడు 'నా వచన మన్యథా కానేరదు. అభిజ్ఞానాభరణదర్శనమున శాపము నివర్తిల్లునులే' అని చెప్పుచు నంతలో నంతర్హితుఁ డయ్యెను.

అనసూయ:—ఇప్పుడు కొంత ఊఁటట కలిగినట్లే. ఆ రాజర్షి నగరికిఁ తరలిపోవుచు జ్ఞప్తికొఱకు అని తన పేరు చెక్కిన ఉంగరము – స్వయముగా శకుంతలవ్రేలికిఁ బెట్టినాఁడుకదా! కావున, శాపనివారణోపాయము చెలి యధీనముగానే యున్నది.

ప్రియంవద:—పోదము రమ్ము. సఖికొఱకు దేవకార్యము నిర్వర్తింతము.

(అని పరిక్రమింతురు.)

(చూచి) అనసూయా! చూడుము. మొగము ఎడమఅఱచేతఁ బెట్టుకొని, ప్రియసఖి, చిత్తరువునందలి వ్రాఁతఁబోలెఁ గానవచ్చుచున్నది. భర్తయందలి చింతచే తన్నే యెఱుఁగకున్నది. ఆగంతుకుని ఎఱుఁగమి వింత యేమి?

అనసూయ:—ప్రియంవదా! ఈ వృత్తాంతము మన యిద్దఱిలోనే యుండనీ; ప్రకృతిపేశలయైన ప్రియసఖిని మనము కాపాడవలసియున్నది.

ప్రియంవద:—విరజాజితీవియను వేఁడినీళ్ల నెవరు తడుపుదురే!

(అని నిష్క్రమింతురు.)

# చతుర్థాంకము

—:o:—

## స్థలము : I — అదే ఉటజము.

(అంత నిద్రమేల్కొని శిష్యుఁడు ప్రవేశించును.)

శిష్యుఁడు:—ప్రవాసమునుండి ప్రతినివృత్తులైన కాశ్యపపాదులవారు, ప్రొద్దుచూచి రమ్మని యానతిచ్చినారు. వెలికిఁబోయి రేయి యింక నెంత శేషించి యున్నదో చూచెదను. (పోయి చూచి) అహో, తెల్లవాఱ వచ్చుచున్నదే! ఇదె,

చ. అరిగెడి నోషధీశుఁ డపరాచలకూటము మాటు కొక్కెచో;
అరుణపురస్కృతుం డుదయమందెడిఁజండమయూఖుఁడొండుచో;
ఇరువురకుం బ్రభానిధుల కెగ్గును లగ్గు నొకంటఁ గల్మిచే
నరయఁదగుఁ జనమ్ము స్వదశాంతరముల్ నియతమ్ము లట్లుగాఁ.

ఖుఱియు,

తే. ఇందుఁ డంతర్హితుండుగా నింపు తలఁగి
యల కుముద్వతి నాచూడ్కి కెలమి నిడదు
సతుల కిష్టప్రవాససంజాత యాత
నలు నితాంతమ్ము దుస్సహంబులు తలంప.

(అనసూయ తెరచిమ్ముకొని ప్రవేశించి)

అనసూయ:—అయ్యో! అట్టి రాజుచే శకుంతల కెంత యన్యాయ్యము జరిగినది! విషయపరాఙ్ముఖమైన జనమునకుఁ గూడఁ దెల్లముగాఁ దెలియుచున్నదే!

శిష్యుఁడు:—ఇప్పుడు హోమవేళ యైనదని గురువులకు నివేదించెదను.

(అని నిష్క్రమించును.)

అనసూయ:—తెలిసి యేమి ప్రయోజనము? ఉచితములైన కరణీయములు సేయుటకు నాకు కాలుసేతు లాడకున్నవి. కందర్పుఁడు ఇపుడు కృతార్థుఁ డగుఁగాత, అసత్యసంధుఁడైన జనునియందు శూన్యహృదయకు శకుంతలకుఁ దావుకల్పించి నందుకు; లేక దుర్వాసులవారి శాపమే యీ మార్పుకుఁ గారణమగునా? కాకున్న ఆవిధముగా బాసయిచ్చి ఇంతకాలమైనను లేఖామాత్రమైనఁ బంప కుండునా? కావున ఆయన ఆనవాలుగా నిచ్చిన యంగుళీయకము నాతని కడకే పంపెదను. దుఃఖశీలమగు తపస్విజనముప్రార్థన యెవఁడు ఆదరించును? ప్రవాసమునుండి మరలివచ్చిన కాశ్యపులునాయనగారికి దుష్యంత పరిణీతయై,

ఆపన్నసత్త్వయై యున్న శకుంతలవృత్తాంత మెఱింగింపఁ బూనియు, నెచ్చెలి మీఁదికి తప్పువచ్చునేమో యని చెప్ప నేరకున్నాను. ఈ స్థితిలో మాకు ఏమి సేయుటకును దోఁపకున్నది.

(ప్రియంవద - హర్షముతోఁ బ్రవేశించును.)

ప్రియంవద:—త్వరపడు, త్వరపడు, శకుంతల ప్రస్థానకౌతుకము నిర్వర్తించుటకు.

అనసూయ:—సఖీ! ఇది యేమి?

ప్రియంవద:—వినుము. 'చక్కఁగా నిదురించితివా?' అని యడుగుటకు నేను ఇప్పుడే శకుంతలయొద్దకుఁ బోయియుంటిని.

అనసూయ:—ఆవల, ఆవల.

ప్రియంవద:—సిగ్గుచేఁ దలవంచుకొనియున్న నెచ్చెలిని కాశ్యపులునాయనగారు కౌఁగిలించికొని యిట్లు అభినందించిరి :

"కన్నులకుఁ బొగ క్రమ్మియున్నను, యజమానుని యాహుతి అదృష్టవశమున అగ్నియందే పడినది. కుమారీ! సుశిష్యునకు ఈయఁబడిన విద్యవలె నీవు అశోచనీయవైతివి. రాజర్షి పరిగృహీతను నిన్ను ఇప్పుడే తత్సమీపమునకు పనిచెదను" అని.

అనసూయ:—ఈ వృత్తాంతమంతయు నాయనగారి కెవరు చెప్పిరే?

ప్రియంవద:—నాయనగారు అగ్నిహోత్రగృహము చొచ్చిచొరక ముందే అశరీరమైన ఛందోమయ వాక్కు ఇట్లు పలికినది.

అనసూయ:—(చిఱునగవుతో) చెలీ, చెప్పుము. ఆవాక్కు ఏమని పలికినది?

ప్రియంవద:— క. జగతీ విభూతి కొఱకై
మొగి దుష్యంతోరు తేజమును దాలిచి చె
న్నగు నీ తనయఁ మునివ
ర్య! గణింపుము వహ్నిగర్భయగు శమినివలెన్—అని

అనసూయ:—(ప్రియంవదను కౌఁగిలించుకొని) ఇప్పుడు నా డెందము కుదుటఁబడినది. కాని యీ యానందములో శకుంతల మనల నిపుడే విడిచిపోవునను చింత మిళితమైయున్నది.

ప్రియంవద:—సఖీ! మనచింత కేమిలే. ఎట్లేని ఉపశమించుకొనవచ్చును. తపసించుచున్న శకుంతల ఊఱడిలుఁగావుత.

అనసూయ:—అటైన, నిదిగో, ఈ మామిడికొమ్మకు వ్రేలాడఁగట్టఁబడియున్న కొబ్బెరాకు పుటికలో చెలి నిమిత్తమే నేనొక పొగడ పూదండను పెక్కు

నాళ్లుండుదానిని బెట్టియున్నాను. నీవు దానిని చేతికి తీసికో. ఈలోన నేనును గోరోచనముతోను, తీర్థమృత్తికతోను, గఱికచివుళ్లతోను ప్రియసఖికి మంగళార్థమైన మైపూఁత విరచించెదను.

ప్రియంవద:—అట్లే, కానిమ్ము. (అనసూయ నిష్క్రమించును.)

(ప్రియంవద నాట్యముచేఁ బుష్పకరండ మందుకొనును.)

(తెరలో)

గౌతమీ! శార్ఙ్గరవాదులతోఁ జెప్పుము శకుంతలను తోడ్కొనిపోవుటకు సిద్ధముగా నుండుఁడని.

ప్రియంవద:—(విని) అనసూయా, త్వరపడుము, త్వరపడుము. హస్తినాపురము పోవలసిన ఋషుల నపుడే పిలుచుచున్నారు.

(అంగరాగము చేతఁగొని అనసూయ ప్రవేశించును.)

అనసూయ:—సఖీ, రా, రా, వడిగా మనము పోవుదము.

ప్రియంవద:—(చూచి) ప్రియసఖి తెల్లవాఱులోపలనే, తలంటు పోసికొని అదే కూర్చుండి యున్నది. నీవారాక్షతలు సేతఁబూని స్వస్తివచనములతో తాపస స్త్రీలు ఆశీస్సు లిడుచున్నారు. రమ్ము దగ్గఱకుఁ బోదము. (అని యిర్వురు సమీపించుచున్నారు.)

(అంత యథోక్తవ్యాపార శకుంతల ప్రవేశించును.)

తాపసి:—(శకుంతల నుద్దేశించి) కుమారా, భర్తృబహుమానసూచకము 'మహాదేవి' పదము పొందుము.

మఱియొకతె:—అమ్మాయీ, వీరప్రసూతవు కమ్ము.

ఇంకొకతె:—పుత్రీ, భర్తృబహుమానమునకుఁ బాత్రమ వగుము.

(దీవనలిచ్చి గౌతమితప్ప నందఱు నిష్క్రమింతురు.

సఖులు:—(సమీపించి) సఖీ! నీకు మంగళస్నాన మైనదా?

శకుంతల:—స్వాగతము ప్రియసఖులకు; రండు; ఇటఁ గూర్చుండుఁడు.

ఇరువురు:—(మంగళపాత్రములు చేతఁగొని కూర్చుండి) సఖీ, శకుంతలా! సరిగా కూరుచుండుము. నీకు మంగళాంగరాగము విరచించెదము.

శకుంతల:—సఖులారా, ఎంతో ప్రియముగా నున్నది. సఖీమండనము నాకింక దుర్లభము కదా (అని కన్నీళ్లు పెట్టుకొనును.)

ఇరువురు:—సఖీ, ఈ శుభసమయమున కన్నీరు పెట్టుకోరాదు. (అని కన్నీటిఁదుడిచి నాట్యముచే నలంకరింతురు.)

ప్రియంవద:—సఖీ, ఆశ్రమసులభములైన యీ యలంకృతులు, ఆభరణోచితమైన నీ రూపమునకు వికృతిం దెచ్చుచున్నవి.

(అంత కానుకలు చేతఁబట్టుకొని యిద్దరు ఋషికుమారులు ప్రవేశించుచున్నారు.)

ఋషికుమారులు:—ఇవిగో ఆభరణములు. ఆమెను అలంకరింపుఁడు.

(అందఱును జూచి యచ్చెరువు నటింతురు.)

గౌతమి:—వత్సా! నారదా! ఎక్కడివిరా ఇవి?

ప్రథముఁడు:—కాశ్యపులునాయనగారి తపఃప్రభావమున జనితములు.

గౌతమి:—ఏమీ మానసిక సృష్టియా?

ద్వితీయుఁడు:—కాదు; వినుఁడు. శకుంతలకొఱకు వనస్పతులనుండి కుసుమములు కోసికొనిరండని నాయనగారాజ్ఞాపించిరి. అంత నపుడు—

మ. ద్రుమమొండిచ్చె సుధాంశుపాండురము సాధుక్షౌమమున్; వేఱొకం
డు మహీంజాక్షిచె లత్తుకన్ దలిరుటడ్గుందోయికిం బూఁతగా;
తమిన్నె నామణిబంధనోచ్ఛ్రితము లుద్యత్పల్లవోద్భేద తు
ల్యములౌ పాణితలమ్ములన్ బుడికె భూషాళుల్ వనీదేవతల్.

ప్రియంవద:—(శకుంతలను జూచి) సఖీ, ఈ యభ్యుపపత్తియంతయు భర్తృగేహమున నీ వనుభవింపఁబోవు రాజ్యలక్ష్మికి సూచకముగా నున్నది. (శకుంతల లజ్జ నభినయించును.)

ప్రథముఁడు:—గౌతమీ! త్వరగా రమ్ము. అభిషేకావతీర్ణులైన కాశ్యపులవారికి ఈ వనస్పతుల సేవ నివేదింతము.

ద్వితీయుఁడు:—సరే, రామఁటే. (అని నిష్క్రమించుచున్నారు.)

అనసూయ:—మేము నగల నలంకరించికొని యెఱుఁగము కదా! ఐనను చిత్రలేఖన పరిచయమున, ఇపుడు నీమేన వీని విన్యసించెదము.

శకుంతల:—మీ నేర్పు నే నెఱుఁగుదునులే. (ఇద్దరు నాట్యముచే నలంకరింతురు.)

(అంత స్నానోత్థితుఁడు కాశ్యపుఁడు ప్రవేశించును.)

కాశ్యపుఁడు:—

చ. అరుగు నిదే శకుంతల యటంచు నెడంద కలంతచెందె; శు
గ్గరిమను దృష్టి మ్రానుపడెఁ; గంఠము రాల్పడె నశ్రులాఁప; నీ
నిరతి వనౌకసుండ నగు నేన యలందుర గేస్తు లెంత వం
దురుదురొ యాత్మజాతలను దొల్తఁ దదీశులఁ జేరఁబంపుచోన్.

(అని పరిక్రమించును.)

సఖులు:—సఖీ, శకుంతలా! అలంకరించుట యైనది. ఇఁక లేచి యీ పట్టుఁబుట్టముల రెంటిని ధరింపుము. (శకుంతల లేచి ధరించును.)

గౌతమి:—కుమారీ! నాయనగారు వచ్చియున్నారు. ఆనందపరివాహియైన కన్నుం దోయితోనే నిన్నుఁ గౌఁగిలించుకొనువారుఁబోలెఁ జూపట్టుచున్నారు. ఆచారము నడపుము.

శకుంతల:—(సిగ్గుతో) నాయనా! నమస్కారము సేయుచున్నాను.

కాశ్యపుఁడు:—తల్లీ,—

క. బహుమతవు కమ్ము పతి క
న్యహామ్ముఁ శర్మిష్ఠ యలయయాతికివలెఁ ద
న్మహిళారత్నము పూరుని
నహి నీవును బడయు చక్రవర్తినిఁ బుత్త్రున్.

గౌతమి:—స్వామీ, ఇవి రెండును రెండువరములు కాని, ఆశీస్సులు కావు.

కాశ్యపుఁడు:—అమ్మా, యిటవచ్చి సద్యోహుతములగు అగ్నులకుఁ బ్రదక్షిణము సేయుము. (శకుంతల ప్రదక్షిణించును. అందఱు పరిక్రమింతురు.)

కాశ్యపుఁడు:—(ఋక్ఛందస్సున నాశీర్వదించును.)

శ్లో. అమీవేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః
సమిద్వంతః ప్రాంతసంస్తీర్ణదర్భాః
అపఘ్నంతో దురితం హవ్యగంధైః
వైతానాస్త్వాం వహ్నయః పాలయంతు.

ఇంక బయలుదేఱుము. (పాఱఁ జూచి) ఏరీ! శార్ఙ్గరవాదులు?

(శిష్యులు ప్రవేశింతురు.)

శిష్యులు:—స్వామీ, ఇదిగో వచ్చియున్నారము.

కాశ్యపుఁడు:—చెలియలికి దారిచూపుము.

శార్ఙ్గరవుఁడు:—భవతీ! ఇటు, ఇటు. (శకుంతల పరిక్రమించును.)

[స్థలము-II — అదేమార్గము]

కాశ్యపుఁడు:—అహో! సన్నిహితదైవతములగు తపోవన తరువులారా!

మ. జలముల్ మీకిడుకంటె మున్నెవతె యాస్వాదింపఁగా నొల్లదో,
తలిరుల్ మీదెసఁగూర్మి నేర్తకయి సేఁతన్ గోరియున్ ద్రుంపదో,

తొలి మీ పూఁ జెదుకా అదెవ్వ తెకుఁ దోడ్తోఁబండువో, యాశకుం
తల యాత్మేశ్వరు నింటి కేఁగెడి, ననుజ్ఞఁ గొల్వ రే యెల్లరున్.

(కోకిలరుతము సూచించి)

ఆ. అనుమతించినట్లె వనవాసబంధు లీ
పాదపమ్ము లింతిపయనమునకు
కల మధురనినాదకలితమ్ముగా నిట్లు
పరభృతమ్ము బదులు పలుకు కతన.

(ఆకాశమున)

చ. లలితపుఁ దమ్మితీఁగెలకొలంకులు కన్నుల కింపునింపఁ, జా
యలతరువుల్ సహస్రకరునాతపతాపము గొంత డింపఁ, ద
జ్జలజపరాగ మంజుల రజఃకలితమ్ము, కుమారి త్రోవ కం
దళ దనుకూల మందపవనమ్ము శివమ్మును నౌను గావుతన్.

(అందఱు విస్మయముతో విందురు.)

గౌతమి:—జ్ఞాతిజనస్నిగ్ధలగు తపోవనదేవతలు వీరుగో నీ ప్రయాణమున కనుమతించిరి. పుత్త్రీ! ఈ పూజ్యురాండ్రకుఁ బ్రణమిల్లుము.

శకుంతల:—(నమస్కరించి - నడచి - జనాంతికము) సఖి, ప్రియంవదా! ఆర్యపుత్త్రుని దర్శింపఁ గుతూహలము మెండుగా నున్నను, ఆశ్రమపదము వదలి నా కాళ్లు ముందుకు సాగకున్నవి.

ప్రియంవద:—తపోవనము విడఁజాలక నీవు విహ్వల వగుటయే కాదు, తపోవనమును నిన్ను విడఁజాలక నీతో సమానావస్థఁ బొందియున్నది. చూడుము.

తే. హరిణములు దర్భకబళమ్ము లవని జార్చు
చుండె, నృత్యమ్ము మానె మయూరములును,
పాండుపత్త్రిములను డుల్చు వ్యాజమునను
అశ్రువులు రాల్చుచున్నవి యఖిలలతలు.

శకుంతల:—(స్మరణకుఁ దెచ్చికొని) నాయనగారూ, నాతోఁగ తోఁబుట్టువును వన జ్యోత్స్నను జూచి సెలవుగైకొని వచ్చెదను.

కాశ్యపుఁడు:—తెలియును నాకు, దానియెడ నీకు సోదరీప్రేమ కలదని. (అది యిదిగో కుడిప్రక్క నున్నది.)

శకుంతల:—(లతను డగ్గఱి) వనజ్యోత్స్నా! సహకారసంగతవయ్యును, ఈ వలకు సాగియున్న శాఖాబాహువులతో నన్నుఁ గౌఁగిలించికొనుము. ఈ నాఁటినుండి నీకు దూరమగుచున్నాను.

కాశ్యపుఁడు:—

చ. చిరముగ నిన్ను నే నెవనిచేత నిడఁగ దలపోసి యుంటినో
వరమతి నాత్మసన్నిభుని వానిన పొందితి వీవు పుణ్యపుం
బరిణతి; నీప్రియాళి నవమాలిక యుఁగ సహకారుఁగూడె; మీ
యిరువురఁగూర్చి నేఁటికి నపేత విషాదుఁడ నైతిఁ; బుత్త్రికా!

అమ్మా, ఇఁక రమ్ము - ఇదే దారి.

శకుంతల:—సఖులారా! ఈ 'వనజ్యోత్స్నను' మీ యిరువుర చేతఁ బెట్టిపోవుచున్నాను.

ఇరువురు:—మా యిరువుర నెవరిచేతఁ బెట్టి పోయెదవు తల్లీ! (అని కన్నీరు పెట్టుకొందురు.)

కాశ్యపుఁడు:—అనసూయా, ఏడువకుము. మీరేకదా శకుంతలకు ధైర్యము చెప్పవలసినవారు. (అందఱు పరిక్రమింతురు.)

శకుంతల.—నాయనా! మన పర్ణశాలసమీపమున గర్భభారమున మెల్ల మెల్లఁగా నడచుచున్న యీ యాఁడులేడి యెప్పుడు సుఖప్రసవ మగునో, అప్పుడు నా కా ప్రియవార్త యెవరిచేతనైనను జెప్పిపంపుఁడు.

కాశ్యపుఁడు:—మంచిది. మఱవనులే.

శకుంతల:—(గతిభంగ మభినయించి) ఎవ రిది? మాటిమాటికి నా చీరకొంగుఁ బట్టుకొని లాగుచున్నారు?

కాశ్యపుఁడు:—కుమారీ!

తే. దర్భకొన గాయపడిన వక్త్రమును గార
తైలమును రాచి మాన్పి, హస్తమునఁ జామ
లొనరనందిచ్చి నీ పెంచుకొనిన తనయుఁ
డీ కురంగకుఁ డెటుపోవనిచ్చు నిన్ను?

శకుంతల:—బిడ్డా! తోడివారి వీడిపోవు నన్నేల యనుసరించెదవు? పుట్టినతోడనే, తల్లిం గోల్పోయి యెట్లో పెరిఁగితివి. పాపము! నేఁడు నేనును నిన్ను విడనాడి పోవుచున్నాను. నాయనగారే ఇఁకమీఁద నిన్నుఁ జూచుకొందురు వత్సా! దిగులుపడకు. ఇంక మరలుము. (అని యేడ్చుచు నడచుచున్నది.)

**కాశ్యపుఁడు:**—

తే. ఱెప్పలను బైకిఁబుచ్చుచు దృష్టిఁగప్పు
నశ్రువులజాలడంపు ధైర్యమువహించి
పల్లమును మిట్టు గనరానిపథ మిది, యిట
దడఁబడంబోలు నీదుపాదములు తల్లి!

**శార్ఙ్గరవుఁడు:**—స్వామీ, బంధువుల సాగనంపుట నీటిపట్టువఱకే అని విందుము. ఇదే చెఱువుగట్టు. ఇచట మాకు సందేశమిచ్చి తమరు మరలిపోవచ్చును.

**కాశ్యపుఁడు:**—అట్లైన, ఈ పాలచెట్టునీడ నిలుతము రండు.

(అందఱు పరిక్రమించి నిలుతురు.)

**కాశ్యపుఁడు:**—(ఆత్మగతము) మాననీయుఁడైన దుష్యంతునకు యుక్తరూపముగా నే నేమని సందేశింతును? (అని యాలోచించుచుండును.)

**శకుంతల:**—(జనాంతికము) చెలీ! కుడివంకఁ జూడుము. నలినీపత్రాంతరితుఁడైన మాత్రమున సహచరునిగానక జక్కవపొలఁతి బెగ్గలి యెట్లు కూయుచున్నదో. నే నన్ననో దుష్కరము నాచరించుచున్నాను.

**అనసూయ:**—అట్లనుకొనకుము, సఖీ!

ఆ. ఇదియుఁ బ్రియునిబాసి యెట్టులో వేగించు
తతవిషాద దీర్ఘతరము నిశను
వెండిఁ గలయునాశ యుండెనా? సహ్యమా
విరహదుఃఖ మెంత వితతమైన.

**కాశ్యపుఁడు:**—శార్ఙ్గరవా! శకుంతలను పురస్కరించుకొని నీవు నామాటగా రాజుతో నిట్లనవలయును :

**శార్ఙ్గరవుఁడు:**—స్వామీ! ఏమని యనవలయునో సెలవిందు.

**కాశ్యపుఁడు:**—

చ. తలఁచి మముఁ దపోధనులఁ, దావకవంశమహత్త్వమెంచి, పై
దలి యెటులో యబంధుఘటితమ్ముగ నీయెడ నించినట్టి య
ర్మిలిగని, యాంద్రతోడి సరిప్రేముడి నీసతిఁజూడు మాపయిన్
గలిగెడి పేర్మి భాగ్య, మది కన్నియబంధులు వేఁడరాదుగా.

**శార్ఙ్గరవుఁడు:**—సందేశము గ్రహించితిని.

**కాశ్యపుఁడు:**—కుమారీ! ఇప్పుడు మేము నిన్ననుశాసింపవలసియున్నది. వనవాసుల మయ్యును మేము లోకజ్ఞతకూడఁ గలవారమే సుమా.

శార్ఙ్గరవుఁడు:—ధీమంతులకు గోచరముకాని దేమి యుండును?

కాశ్యపుఁడు:—నీవు-ఇట మీఁదఁ బతియిల్లు సొచ్చి

చ. గురువులభక్తిఁ గొల్వు, మనుఁగుంజెలివై సవతాండ్రఁదన్పు, మే
యఱిముఱినైన భర్త కెదురాడకు మల్కఁ, శ్రితావనైక త
త్పరవగు, ముద్ధతిన్ గనకు భాగ్యమునన్, దెఱఁగిట్టిదేనిఁ దా
ల్తురు గృహిణీపదమ్ము యువతుల్, ప్రతికూలలు వంశపాంసులల్.

గౌతమి:—ఇంతకుమించి వధూజనులకుఁ జేయవలయు నుపదేశము లేదు. తనయా! దీనిని జక్కఁగా పాటింపుము.

కాశ్యపుఁడు:—కుమారీ! నన్నును నీ సఖులను గౌఁగిలించికొనుము.

శకుంతల:—నాయనా! ఇటనుండియే వెనుకకు మరలెదరా నెచ్చెలులు.

కాశ్యపుఁడు:—కుమారీ! వీరును ఒకరి కియ్యఁబడవలసినవారే కదా. వీరు అచ్చటికి వచ్చుట యుక్తము గాదు. నీతోఁగూడ గౌతమి వచ్చును.

శకుంతల.—(తండ్రిని గౌఁగిలించుకొని) నాయనా! మీ ఉత్సంగమునుండి జాఱిన దాననై మలయతటమునుండి ఉన్మూలింపఁబడిన చందనలతవలె నేను దేశాంతరమున జీవితము నెట్లు ధరింపఁగలను?

కాశ్యపుఁడు:—పుత్త్రీ! యేల అధైర్యపడియెదవు?

మ. కులవంతుండగు భర్త మెచ్చుకొను సౌగుణ్యంపు టిల్లాలవై
యలఘు ప్రాభవ తత్కృతిక్రియల నిత్యవ్యగ్రవై యుండి, య
త్తొలిది క్కర్కునిఁ బోలెఁ బావనునిఁ బుత్త్రున్ వైళమే కాంచి, య
వ్వల మాతోడి వియోగజవ్యథ గణింపంబోవు; పుణ్యాకృతీ!

(శకుంతల తండ్రిపాదముల వ్రాలును.)

కాశ్యపుఁడు:—అభీష్టసిద్ధిరస్తు.

శకుంతల:—(సఖుల సమీపించి) మీ రిద్దఱు నన్ను ఒకటిగానే కౌఁగిలించుకొనుఁడు.

ఇరువురు:—(అట్లే చేసి) సఖీ! ఒకవేళ ఆ రాజర్షి నిన్ను తత్క్షణము గుఱితింపఁడేని తన పేరు చెక్కియున్న యీ యంగులీయకము ఆయనకుఁ జూపుము.

శకుంతల:—సఖులారా! మీ నుడువు నీ సందేహముచే నా డెందము కంపిల్లుచున్నది.

ఇరువురు:—భయపడకుము. అతి స్నేహము పాపశంకి.

శార్ఙ్గరవుఁడు:—జాము ప్రొద్దెక్కినది. అమ్మా! త్వరపడవలయును.

శకుంతల:—(ఆశ్రమమువంకఁ దిరిగి) నాయనగారూ, తపోవనము మరల నెపుడు చూతునో కదా?

కాశ్యపుఁడు:—పుత్త్రీ, వినుము—

చ. అభిరతిఁ బెక్కు లేండ్లు చతురంతమహీసతికిన్ సపత్నివై
త్రిభువనవీరునిన్ బతిసదృక్షుని బుత్త్రునిగాంచి, ప్రాక్కటుం
బభరము వానిపై నిడిన భర్తృపిఱుంద మఱొక్కసారి శాం
తిభవన మిత్తపోవనముఁ దేఁకువఁ జొచ్చెద వీవు; పుత్త్రికా!

గౌతమి:—తనయా! ప్రయాణవేళ దాఁటిపోవుచున్నది. నాయనగారిని బొమ్మనుము. (కణ్వునిఁ జూచి) కాదు, ఇది మరలమరల నిట్లే చెప్పుచుండును. మీరే మరలిపొండు.

కాశ్యపుఁడు:—పుత్త్రీ! నా తపోనుష్ఠానమునకు ఉపరోధము కలుగుచున్నది.

శకుంతల:—(తండ్రిని మరలఁ గౌఁగిలించుకొని) మున్నే తపశ్చరణపీడితమైయున్న మీ శరీరము నా నిమిత్తము ఇంకను కృశించునేమో! శోకము శమింపఁజేసికొనుఁడు.

కాశ్యపుఁడు:—(నిట్టూర్పుతో)

ఆ. పర్ణశాలముంగల బలికిఁగా నీవిడ్డ
నివరి మొలచి కన్నుఁగవకు నిపుడు
కానవచ్చుచుండఁ గలికి, యెట్లు శమించు
త్వద్వియోగశోకభరము నాకు.

అమ్మా పోయిరమ్ము; మార్గము నీకు శుభమగుఁగాక.

(శకుంతలయు సహాయాయులును నిష్క్రమింతురు.)

సఖులు:—(శకుంతల పోయినదిక్కుఁ జూచి) అయ్యో, అయ్యో, ప్రియసఖి శకుంతల వనవాటిబాట వెంతలో అంతర్హిత యైనది.

కాశ్యపుఁడు:—(నిట్టూర్పుతో) అనసూయా! మీ సహచరి పోవనే పోయినది, శోకము నపనయించుకొని నా వెంట రండు.

ఇర్వురు:—నాయనా! శకుంతలలేమి పాడువాఱియున్న తపోవనము ఎట్లు ప్రవేశింతుము?

కాశ్యపుఁడు:—స్నేహప్రవృత్తి యిట్లే తోఁపింపఁజేయుచుండును. (సవిమర్శముగా పరిక్రమించి) ఆహా! శకుంతలను పతికడకుఁ బంపి, ఇపుడు నేను స్వస్థుఁడ నైతిని. ఎందుకనఁగా—

తే. కన్యయన నన్యుసొమ్మె లోకమున నెందు
దానిఁ బతిచెంత కంపినంతనె మదీయ
మంతరాత్మ యతిస్వచ్ఛమయ్యె; నౌర!
యిల్లడనుబోచి తత్స్వామి కిచ్చినట్లు.

(అందఱు నిష్క్రమింతురు.)

## పంచమాంకము

——:O:——

### స్థలము-I — నగరిలో నొక వివిక్త స్థలము.

[అంత నాసనస్థుఁడై రాజును, విదూషకుఁడును ప్రవేశింతురు.]

విదూ:—(చెవియొగ్గి) వయస్యా! అవధానముతో నాలకింపుము. సంగీతశాలాంతరాళమున - కలవిశుద్ధమైన గీతిలో స్వరయోగము వినవచ్చుచున్నది. శ్రీమతి హంసపదిక వర్ణపరిచయము కావించుచున్నదని తలంచెద.

రాజు:—ఊరకుండుము. నేను విని చెప్పెదను.

(ఆకాశమున పాట వినఁబడును.)

తే. క్రొత్తపూఁదేనె మనసారఁ గ్రోలునాశ
నాామ్రమంజరి నట్లు ముద్దాడియాడి
శతదళ నివాసమాత్ర నిర్వృతమ వగుచు
మఱచితే క్రియ నద్దాని మధుకరంబ!

ఆహా! రాగపరివాహినిగా నున్నది. పాట.

విదూ:—పాట మాట యుండనీ. అక్షరార్థము నీకు అవగత మైనదా?

రాజు:—(చిఱునవ్వు నవ్వి) ఒకప్పుడు ఈ జనమును నేను ప్రేమించితిని. వసుమతీదేవిని మనస్సులోఁ బెట్టుకొని ఇపుడు ఈమె నన్నెత్తిపొడుచుటగాఁ గానవచ్చుచున్నది. వయస్యా! నామాటగాఁ జెప్పుము హంసపదికతోఁ 'చక్కఁగా ఉపాలంభించితివి' అని.

విదూ:—చిత్తము (అని లేచి) వయస్యా, అచటికిఁ బోయినపిదప ఆమె యాజ్ఞచే చెలికత్తెలు నా జుట్టుపట్టుకొనిరా, అచ్చరలచేఁ జిక్కిన విరాగికివలె నాకు విముక్తి దుర్లభము.

రాజు:—భయము లేదులే. పోయి నాగరకముగాఁ జెప్పవోయి.

విదూ:—విధి లేదు. (అని నిష్క్రమించును.)

రాజు:—(ఆత్మగతము) ఎంటువలననో, ఇట్టి యర్థముగల పాట విని, యిష్టజనుల యెడఁ బాటు లేకున్నను, నేను మిగుల వ్యాకులితుఁడ నగుచున్నాను.

చ. సురుచిర రూపముల్ గనియు సొంపగు శబ్దము లాలకించియుఁ
వరసుఖియైన మర్త్యుఁడు నవారణఁ దాఁ దమకించు టెల్ల, సు

స్థిరముగ భావమం దధివసించు భవాంతర సౌహృదంబులన్
గరము నబోధపూర్వకముగా స్మరియించుటచేత నే సుమీ.

(అని పర్యాకులితుఁడై యుండును.)

(అంత కంచుకి ప్రవేశించును.)

కంచుకి:—(నిట్టూర్పుతో) ఆహా! ఎట్టి యవస్థను బొందినవాఁడ నైతిని.

తే. అభిహి తాచారమని వేత్రయష్టి దీనిఁ
బూనితినొ మున్ను నృపు నంతిపురములందు
ఎండ్లు పెక్కేఁగ గతిదార్ఢ్య మెడలు నాకు
నదియ నేఁటికి నవలంబనార్థ మయ్యె.

రాజునకు, ధర్మకార్యము లవిలంబముగా ననుష్ఠేయములే కాని ధర్మాసనము నుండి యిప్పుడే లేచిన యేలినవారికి మరల నుపరోధకారియైన కణ్వశిష్యాగమనము నివేదింప నిచ్చగింపకున్నాను. లోకతంత్రాధికారము విశ్రాంతి కొడము నీయనిది కదా! ఎట్లన,

తే. ఎడప కొకమాఱె పూన్చు భానుఁడు గుఱాల,
రేవగలు నాక సతముం జరించు గాడ్పు,
పుడమిఁ దలఁదాల్చు శేషుఁ డెప్పుడును విడక
మహిని 'షష్ఠాంశవృత్తి ధర్మమును' నిదియ.

కావున, నా పనిని నేను జేసెదను.

(పరిక్రమించి చూచి) వీరుగో ప్రభువులవారు.

తే. స్వప్రజనుబోలెఁ బ్రజ ధర్మపదవి నడపి
విరతుఁడై వివిక్తంబు సేవించె నితఁడు
యూథములఁ ద్రిప్పి కట్టెండకోడి పగటఁ
జలువనీడఁ జేరెడు కరిస్వామిఁ బోలె.

(సమీపించి) జయము జయము ఏలినవారికి. వీరే హిమవత్ప్రాంతవనవాసులైన తపస్వులు. కాశ్యప సందేశము గొని స్త్రీలతోఁ గూడి వచ్చియున్నారు. అటుపై ఏలినవారి చిత్తము.

రాజు:—(ఆదరముతో) ఏమీ, కాశ్యపుల సందేశమును దెచ్చినారా?

కంచుకి:—చిత్తము.

రాజు:—అట్లైన మా మాటగా ఉపాధ్యాయులు సోమరాతులవారితోఁ జెప్పుము. 'ఈ యాశ్రమవాసులను శ్రౌతవిధిచే సత్కరించి తోడ్కొనిరమ్మని. నేనును తపస్విజన సందర్శనయోగ్య ప్రదేశమున వారి రాక ప్రతీక్షించెదను.

కంచుకి:—ఏలినవారి యాజ్ఞ. (అని నిష్క్రమించును.)

రాజు:—(లేచి) ఎవఁడురా అక్కడ?

ప్రతిహారి:—(ప్రవేశించి) ప్రభూ! ఏమి యాజ్ఞ?

రాజు:—వేత్రవతీ! అగ్నిహోత్ర గృహమునకు దారిచూపుము.

ప్రతిహారి:—ఇటు. ఇటు. దేవరవారు.

రాజు.—(అధికారఖేదము నభినయించి) ఎల్లరు ఇష్టసిద్ధిఁ బడసి, సుఖులయ్యెదరు. రాజులకుమాత్రము అట్టి సిద్ధియు దుఃఖప్రాప్తికే యగుచున్నది.

తే. ప్రాప్తి యాత్సుక్యమాత్రంబు నపనయించు
ప్రాప్తపాలన మిట్టు లారటము పెంచు
స్వకర ధృతదండమగు నాతపత్ర మట్లు
రాజ్యమె శ్రమంబుగూరుచు శ్రమము నాఱ్చు.

(తెరలో వైతాళికులు) జయము జయము ఏలినవారికి.

ప్రథముఁడు:—

ఆ. స్వసుఖచింతదక్కి ప్రజలకై తపియింతు
విట్టి దార! నీదువృత్తి మెపుడు;
ఖరకరాంశుతప్త శిరమా తరువు నీడ
నాశ్రితాళితాప మడఁచినట్లు.

ద్వితీయుఁడు:—

తరల. అపథవర్తుల నాత్తదండుఁడవై మరల్చెదు త్రోవకున్,
వ్యసనయింతు వివాదముల్, బ్రియమారఁ బ్రోతు సమర్థతన్
విపుల సంపదలందు జ్ఞాతు లనేకు లుండురుగాక మో
నృప! ప్రపూరిత బంధుకృత్యుఁడ వీవ సుమ్ము జనాళికిన్.

రాజు:—ఇదిగో, మనస్సులోని గాసి తీఱి, మరల నూతనస్వాస్థ్యముం బొందితిమి.

(అని పరిక్రమించును.)

[స్థలము-II — నగరిలోనే యగ్నిగృహము.]

ప్రతిహారి:—ఇదే, యగ్నిహోత్రగృహము ముంగిలి. క్రొత్తగా సమ్మార్జితమై ప్రక్కన హోమధేనువుతోడ శోభిల్లుచున్నది. ఏలినవారు పైకి దయచేయుదురు గాక,

రాజు:—(ఎక్కి. పరిజనము భుజముపై చేయూని నిలిచి) వేత్రవతీ! పూజ్యులగు కాశ్యపులవారు ఏమి యుద్దేశించి నా యొద్దకు ఈ ఋషులఁ బంపియుందురు.

శా. ప్రత్యూహమ్ములు కల్గెనో మునిజనారబ్ధవ్రత శ్రేణికిన్,
వ్రాత్యుం డాశ్రమజంతుకోటి నెవఁడేన్ బాధించెనో, నా యస
త్కృత్యానన్ లతికల్ ననల్ తొడగవో, యిట్లంచుఁ బెల్లూహలన్
సత్యం బేర్పఱుపంగరాక యిదె మత్స్వాంతమ్ము క్షోభిల్లెడిన్.

ప్రతిహారి:—ఏలినవారి సుచరితమునకు సంతుష్టులై ఈ ఋషులు ప్రభువుల సంభావించుటకు వచ్చినారని నా యూహ.

(అంత గౌతమీసహితయైన శకుంతలను పురస్కరించుకొని మునులును వారి ముందఱ పురోహితుఁడు కంచుకియుఁ బ్రవేశింతురు.)

కంచుకి:—పూజ్యులారా, ఇటు. ఇటు.

శార్ఙ్గరవుఁడు:—శారద్వతా!

శా. పాడిన్ వీడఁ డొకించుకేనియు మహాభాగుండు తేఁ డీతఁ, డే
వాఁ డేజాతిని నెట్టిఁడున్ గుపథముం బాటింపఁ, డట్లయ్యు నే
నాఁడున్ సిద్ధవివిక్తసేవి నగుటన్ నాకున్ జనాకీర్ణ మీ
పీ డత్యర్థముతోఁచు వహ్నివృత మౌ వేశ్మంబు చందంబునన్.

శారద్వతుఁడు:—నీవు చెప్పినది యుక్తమే. నగరప్రదేశమున నీ విట్లయితివి. నేనును

తే. స్నాతుఁ డభ్యక్తునింబోలె, జాగరితుఁడు
సుప్తునింబలె, శుద్ధుం డశుచినివలెను
స్వైరగతి బద్ధునట్లు లశ్రాంతవిషయ
సుఖవిలోలాత్ములగు వీరిఁ జూతు నేను.

శకుంతల:—(దుర్నిమిత్తమును సూచించి) అయ్యో, ఏమిది? నా కుడికన్నదరుచున్నది?

గౌతమి:—కుమారీ! అమంగళము ప్రతిహత మవును గావుత. నీ భర్తకులదేవతలు నీకు శుభములు కూర్తురుగాత. (అని పరిక్రమించును.)

పురోహితుఁడు:—(రాజును నిర్దేశించి) తపస్వులారా! ఇదే వర్ణాశ్రమరక్షకుఁడు, ముందుగానే యాసనమునుండి లేచి మీ రాక కెదురుసూచుచున్నాఁడు - మాననీయుఁడు. ఇతని దర్శింపుఁడు.

శార్ఙ్గరవుఁడు:—బ్రాహ్మణోత్తమా! ఇది యభినందనీయమే కాని, యిందు మేము మధ్యస్థులము. ఏలన,—

తే. తరులు నమ్రమ్ములగు ఫలోద్గమము నెనసి,
నవాంబువుల నవారి నవవారి వారిదములు,
ఉద్ధతులుగారు సుజనుల్ సమృద్ధిచేత,
ఇదియ స్వాభావిజము పరోపకృతిపరులకు.

ప్రతిహారి:—దేవా! ఈ ఋషులు ప్రసన్నముఖరాగులుగాఁ గానవచ్చుచున్నారు. కాఁబట్టి వీరు వచ్చినపని నెయ్యముతోఁడఁ గూడినదే యని నేను తలఁచుచున్నాను.

రాజు:—(శకుంతలను జూచి) మఱి, ఈ యింతి

ఆ. మేల్మెుసుంగుకతన మేనిచెల్వంపుఁ బెం
పించు కించుకంతె యేరుపడఁగ
పాండుపత్త్రమధ్య పల్లవమ్మట్లు సం
యములనడుమ నీశుభాంగి యెవరో?

ప్రతిహారి:—దేవా! నేనును ఊహించి నిశ్చయింప నేరకున్నాను. ఈమె యాకారము మాత్రము దర్శనీయముగాఁ గానవచ్చుచున్నది.

రాజు:—అగుఁగాక, పరకళత్రమును దేఱి చూడరాదు.

శకుంతల:—(చేయి గుండెలపైఁ బెట్టుకొని - ఆత్మగతము) హృదయమా! ఏల యిట్లు కంపిల్లుచున్నావు ఆర్యపుత్త్రుని భావము ఎఱుంగకయే. అంతదనుక ధైర్యము వహించియుండుము.

పురోహితుఁడు:—(ముందుకు వచ్చి) దేవా! వీరే తపస్వులు. విధిప్రకారము అర్చితులైరి. వీరు తమ యుపాధ్యాయుల సందేశమేదో కొనితెచ్చి యున్నారఁట. దానిని మీరు వినవలయును.

రాజు:—సావధానుఁడనై యున్నాను.

ఋషులు:—(చేయెత్తి) రాజా! విజయివి గమ్ము.

రాజు:—మీ కందఱకు అభివాదనములు.

ఋషులు:—నీకు స్వస్తియగుఁగాక, ఇష్టసిద్ధియగుఁగాక.

రాజు:—మునుల తపస్సులు నిర్విఘ్నముగా సాగుచున్నవా?

ఋషులు:—రాజా,—

క. సాధువుల నీవు ప్రోవం
గా ధర్మక్రియల కేల గ్లాని ఘటిల్లున్?

దీధితుల భాస్కరుఁడు దా
వేధోండము గప్పఁ దమము వెలయంగలదే?

రాజు:—నా రాజశబ్దము నేఁటికి సార్థకమైనది. మఱి లోకానుగ్రహార్థము కాశ్యపుల వారు కుశలముగా నున్నారా?

శార్ఙ్గరవుఁడు:—తపస్సిద్ధి కలవారికి కుశలము స్వాయత్తమే. వారు, తమ 'అనామయ' మడిగి - ఈ మాట చెప్పుమనిరి.

రాజు:—ఏమి యాజ్ఞాపించుచున్నారు మహానుభావులు?

శార్ఙ్గరవుఁడు:—'పరస్పర సంకేతముచే నీవు ఈ నా కుమారికను పెండ్లియాడితివి' అందులకు ప్రీతుఁడనై మీ యిర్వుర కనుమతి యొసంగినాఁడను.' ఏలయన,-

తే. అర్హాజనులందు నగ్రీయుఁ డంద్రు నిన్ను,
ఈ శకుంతల మూర్తపుణ్యైకరాశి,
తులితగుణులై తగు వధూవరులనుఁ గూర్చి
ధాత నేఁటికి చిరప్రవాదంబు తలఁగె.

ఈమెను ఆపన్నసత్త్వను సహధర్మాచరణమునకుఁ బ్రతిగ్రహింతువుగాక' యని.

గౌతమి:—ఆర్యా, నాకును ఏమేని చెప్పవలయునని యున్నది కాని దాని కవకాశము లేదు. ఎట్లనఁగా,

క. గురుజనము వేఁడ వీ వీ
తరశాక్షియు బంధుసమ్మతము గొనదు, పర
స్పర మిట్టులైన మీ యొం
డొరులకు నేనేమి చెప్పనోపుదు నిచటన్.

శకుంతల:—(ఆత్మగతము) ఆర్యపుత్త్రుఁ డేమనునో కదా!

రాజు:—ఇదేమి? యీ యుపన్యాసము.

శకుంతల:—(ఆత్మగతము) పావనముగదా యీ యుపన్యాసము!

శార్ఙ్గరవుఁడు:—'ఇదేమి' అని యనియెద వేమి? లోకతంత్రమున నత్యంత నిష్ణాతులగు మీ రెఱుఁగరా?

ఆ. పుట్టినింట నున్న పూత చరిత్రనైన
నన్యథా తలంతు రవనిజనులు
కాన భర్తృకిష్టకాకున్న మగనాలి
పతిని చేర్పనెంత్రు బంధుజనులు.

రాజు:—ఏమి! ఈమెను మేము పెండ్లియాడి యుంటిమా?

శకుంతల:—(విషాదముతో ఆత్మగతము) హృదయమా! నీభయ మిప్పటికి యుక్తమే యైనది.

శార్ఙ్గరవుఁడు:—

క. కృతకార్య ద్వేషమొ? ధ
ర్మతృణీకరణైక రతియొ? మముఁ గేరుటయో?

రాజు:—అసత్కల్పనలతో నేల మమ్మిట్లు ప్రశ్నించెదరు?

శార్ఙ్గరవుఁడు:—ఏలనా?

వితతమ్ము లీ వికారము
లతిమాత్రైశ్వర్య మత్తులగు వారికడన్.

రాజు:—మీరు మమ్ము మిక్కుటముగాఁ దూలనాడుచున్నారు.

గౌతమి:—కుమారీ! ముహూర్తమాత్రము సిగ్గిలకుము. నీ యవకుంఠనము తొలఁగించెదను. దానివలన నీ భర్త నిన్ను గుఱుతింపఁగలఁడు. (అని యట్లే సేయుచున్నది.)

రాజు:—(శకుంతలను తేఱిచూచి యాత్మగతము)

మ. నవలావణ్యము మూర్తిఁ గైకొనియెనా నా ముందరిన్ జూపట్టు ని
య్యువతీ రత్నము గొంటినో తొలుత, లేదో, నిశ్చయింపంగ లే
క విభాతమ్మున నంతరస్థహిమమై క్రాల్కుందముం షట్పద
ప్రవరం బట్లు భుజింపఁజాలఁ ద్యజియింపంజాల నే నియ్యెడన్.

(అని విచారించుచుండును.)

పరిజనము:—(జనాంతికము) ఆహా! ప్రభువుగారి ధర్మప్రవణత. ఇట్టి సుఖప్రాప్త దివ్యరూపము గాంచియు నెవ్వఁడు వితర్కించుచుండును?

శార్ఙ్గరవుఁడు:—అయ్యా, మూన మేల? ఏదో యొకటి చెప్పుఁడు.

రాజు:—తపోధనా! ఎంత చింతించినను, ఈమెను నేను పరిగ్రహించినట్లు స్మరింపలేకయున్నాను. అభివ్యక్తగర్భచిహ్న యగు నీమెకు నేను భర్తనా? అని శంకించుచున్నాను.

శకుంతల:—(విషాదముతో ఆత్మగతము) పరిణయమునందే సందేహము. ఇఁక నేల పైపైకిఁ బోవుచున్న నా యాశ.

శార్ఙ్గరవుఁడు:—ఇఁక చాలును.

తే. తనయ నవమర్శనముసేఁత కనుమతించి
ముగుద నీయొద్ద కనుచు నమ్మునియ గర్హ్యాఁ
డెనసి చోరునిఁబట్టి, చేకొనిన ధనము
కొనుమనుచు నాతనికె పంపు గోలవోలె.

శారద్వతుఁడు: — శార్ఙ్గరవా! ఇఁక నీవు విరమింపుము. అమ్మా శకుంతలా! మేము చెప్పవలసినదేమో చెప్పితిమి. ఆయన యిట్లనుచున్నాఁడు. కాఁబట్టి ఆయనకు నమ్మకము గలిగించు ప్రత్యుత్తరము నీవే చెప్పుము.

శకుంతల:—(ఆత్మగతము) అట్టి యనురాగమునకు ఇట్టిగతి పట్టినపుడు, జ్ఞప్తి చేసి యేమి ప్రయోజనము? నాస్థితి యిప్పుడు శోచనీయమై పోయినది. (ప్రకాశము) ఆర్యపుత్రా! (అని యర్థోక్తిలోనే) వివాహమే సంశయాపన్నమై యుండఁగా నిట్టి సంబోధనము యుక్తము కాదు. పౌరవా! నాఁడు తపోవనమున స్వభావోత్తానహృదయమైన యీ జనమును, ఎన్నో బాసలుచేసి మోసపుచ్చి నేఁడు ఇట్టి కఠినాక్షరములచేఁ బరిభవించుట ధర్మముకాదు నీకు.

రాజు:—(చెవులు మూసికొని) పాపము శమించుఁగాత, పాపము శమించుఁగాత.

ఆ. కులవిశుద్ధిఁ జెఱచి, పెలుచ నీజను నధః
పతితుఁజేయ జతనపడియె దేల?
తేటనీటిఁ గలఁచి తీరతరువు గూల్ప
గట్టులొరయు నిమ్నగయునుబోలె.

శకుంతల:—కానిండు. పరపరిగ్రహశంకచేతనే మీ రిట్లు ప్రవర్తించుట యథార్థమైన ఇదిగో యీ అభిజ్ఞానముచేత మీ సందియముం దీర్చెదను.

రాజు:—ఉత్తమమార్గము.

శకుంతల:—(ఉంగర ముండినవ్రేలు తడవికొని) అయ్యో, అయ్యో, నా వ్రేల నుంగరము లేదే. (విషాదముతో గౌతమిం జూచును.)

గౌతమి:—శక్రావతారములో, శచీతీర్థమునకు నీవు నమస్కరించినపుడు ఉంగరము నీ వ్రేలినుండి జాఱిపడినది. సందేహము లేదు.

రాజు:—(చిఱునవ్వుతో) ఇదే. యిట్టిదే. స్త్రీలు ప్రత్యుత్పన్నమతు లన్న లోకుల నానుడికిఁ గారణము.

శకుంతల: —ఇందు దైవము తన ప్రభావము చూపినది! వేఱొక గుఱుతు చెప్పెదను.

రాజు:—ఇప్పటికి వినవలసినవాఁడ నైతిని.

శకుంతల.—ఒకనాఁడు మనము నవమాలికామంటపములో నున్నతఱి, జలపూరితమైన తామరాకుదొప్ప యొకటి మీ చేతిలో నుండెను.

రాజు:—వినుచున్నాను.

శకుంతల:—అప్పుడు నా పెంచుకొన్న లేడిపిల్ల 'దీర్ఘాపాంగ' మనునది మిమ్ము డగ్గఱియెను. అది ముందు త్రావుంగాక యని కనికరముతో నీరుచూపి దాని మీరు పిలిచితిరి. కాని పరిచయములేమిచే నది మీ చేతియొద్దకు రాలేదు. ఆవల నా దొప్పనే నేను నా చేతికి తీసికొనఁగా, నది బెదరుతీఱి నీరు ద్రావ వచ్చినది. అప్పుడు మీ రిట్లు పరిహాసించితిరి. 'ఎల్లవారికి స్వజనమందే విశ్వాసము. మీ రిర్వురును ఆరణ్యకులే కదా!' అని.

రాజు:— స్వకార్యసాధికలగు స్త్రీల యీరీతి కల్లనుడితేనియలచే విషయలోలురు ఆకర్షింపఁబడుదురు.

గౌతమి:—మహాభాగ! మీ రిట్లనరాదు. తపోవనమునం బెరిఁగిన యీ జనము కపటము నెఱుంగదు.

రాజు:—ఓ వృద్ధతాపసీ!

చ. కరము నశిక్షితత్వమగు ప్రగల్భత మానవభిన్నజాతి జా
త రమణులంద కన్పడ, ధృతప్రతిభాఢ్యలఁ జెప్పనేటికిన్?
నెఱి, గగనంబునం దెగురనేర్చెడు నంత కపత్యజాతముం
బరభృత లన్యమౌ ద్విజగణమ్మది పెంపఁగఁ జేఁతఁ జూడమే?

శకుంతల:—(రోషముతో) అనార్య! నీ హృదయమునుబట్టి యందఱు నీయట్టివా రనియే తలంచుచున్నావు. ధర్మకంచుకము గప్పుకొని, తృణచ్ఛన్న కూపము వలెనున్న నీయట్టివా రిఁక నెవ్వరు?

రాజు:—(ఆత్మగతము) నా డెందమును సందేహమున ముంచుచు, ఈమె కోపము కైతవముకాన ట్లగపడుచున్నది. అట్లే కదా.

చ. పెనఁగొను విస్మృతిన్ గఠినవృత్తుఁడనై తనపల్కు నారహః
ప్రణయము నేనలీకమని వాకొనఁగా, నరుణారుణాక్షియై
వనిత, యమర్షవేగమున వక్రములౌ బొమలన్ ముడించె రో
షనిరతిఁ బుష్పసాయకుని చాపము భగ్నముసేయు కైవడిన్.

(ప్రకాశము) కల్యాణీ! దుష్యంతునిచరిత్రము లోకప్రసిద్ధము. ఐనను నీవు చెప్పునది తెలియఁజాలకున్నాను.

శకుంతల:—అంగిట బెల్లము, ఆత్మలో విషము గల యితని నమ్మి యీతనిచేత స్వచ్ఛందచారిణిని గావింపఁబడితిని.

(వస్త్రాంచలమున ముఖముగప్పుకొని యేడ్చును.)

శార్ఙ్గరవుఁడు:—ఇట్లు తన చాపలము అప్రతీకారమై తన్నే దహించును.

తే. అరసిచేయంగఁదగు; నంతకంటె నరసి
చేయఁదగును రహస్యంపుఁ జెలిమియైన
మనసుతెలియని యీరీతి మక్కువలకు
ఫలము పరిణామమున వైరభావమె యగు.

రాజు:—ఆర్యా, ఈమె యొక్క మాటమీఁదనే మమ్ము రోషాక్షరములతో దూషించెదరా?

శార్ఙ్గరవుఁడు:—(అసూయతో) తమరే, అధరోత్తరములు వినియున్నారు.

ఆ. జననమాది కపటమన నేమొ యెఱుఁగని
యట్టివారి నుడులె యనృత మగుత!
సత్యవాదమగుత సత మన్య నికృతియే
కళయుఁబోలెఁ గఱచు ఘనులనుడులు.

రాజు:—ఓయీ, సత్యవాదీ, మీరు చెప్పునది యొప్పుకొందునుగాక, యీమెను వంచనముసేయుటవలన మాకేమి లాభము?

శార్ఙ్గరవుఁడు.—'వినిపాతము!'

రాజు:—'వినిపాతము'ను పౌరవులు కోరుదురనుట నమ్మఁదగినది కాదు.

శార్ఙ్గరవుఁడు:—రాజా! ఏల యీ యుత్తరప్రత్యుత్తరములు. మేము గురువునాజ్ఞ నెఱవేర్చితిమి. ఇఁక మరలిపోయెదము.

క. విడిచనవిడు, కొనినఁ గొను మీ
పడఁతుక నీ భార్య, తక్కువలుకు లిఁకేలా?
పుడమి నిజదారలపయిన్
గడలేనిప్రభుత్వ మొప్పఁగా భర్తలకున్.

గౌతమీ, నీవు ముందు నడువుము. (అని తరలుదురు.)

శకుంతల:—ఇప్పు డేమి చేయుదును? ఈ కితవునిచే వంచిత నైతిని. దుఃఖములో మునిఁగియున్న నన్ను మీరును విడనాడుచున్నారు.

(అని యనుగమించును.)

గౌతమి.—(నిలిచి) వత్సా! శార్ఙ్గరవా? శకుంతల యేడ్చుచు మనల వెంబడించుచున్నదిరా, పాపము-ఏమిసేయును ఈ బిడ్డ, భర్త యట్టి పరుషాక్షరముల నిరాకరింపఁగా,

శార్ఙ్గరవుఁడు:—(రోషముతోఁ దిరిగిచూచి) ఆ! పురోభాగినీ! ఏమి నీ స్వాతంత్ర్యము!

(శకుంతల భయముచే వడఁకుచున్నది.)

శకుంతలా!

తే. ధరణిపతి పల్కు చందంబు దాన వేని
కులమువాసిన నీ వేల గురున కింక?
వృత్త మటుగాక శుద్ధమం చెఱిఁగి తేని
దాసిపట్టైన మేల్ నీకు భర్తయింట.

నిలువుము. నిలువుము. మేము పోయెదము...

రాజు:—ఓ తపస్వీ! ఏల యీమెను వంచించెదవు?

క. హరిణాంకుఁడు కలువలకే
హరిదశ్వుఁడు కమలములకె హర్షకరుఁ డవుర్
ధరణి జితేంద్రియులకుఁ బర
పరిగ్రహ పరాఙ్ముఖత స్వభావ మ్మెందున్.

శార్ఙ్గరవుఁడు — అన్యాసంగముచే పూర్వవృత్తము విస్మరించిన నీవు అధర్మభీరుఁడ వెట్లగుదువు?

రాజు: —(పురోహితునివంక తిరిగి)

ఇందు గురులాఘవములు తమరినే యడిగెదను.

తే. విస్మృతియొ నాకుఁ, గాక యీ వెలఁది నుడులు
కల్లలో? యిందు సత్యమ్ము గాన లేక
వెకలి నగుదునొ కులకాంత వెడలనడఁచి
కాకఘము నొందెదనొ యన్యకాంత నంటి.

పురోహితుఁడు:—(విచారించి) ఇప్పటి కిట్లు సేయుఁడు.

రాజు:—తమరు నన్ననుశాసింతురుగాక.

పురోహితుఁడు.—ఈమె ప్రసవపర్యంతము మా గృహమున నుండుఁగాక. నేను ఏల యిట్లంటినవఁగా, మీకు తొలుచూల్త చక్రవర్తియగు పుత్త్రుఁడు గలుగునని యీవఱకే సాధువు లాదేశించియున్నారు. మునిదౌహిత్రుఁడా తల్లక్షణసమేతుఁడగునేని అప్పుడు సంతోషముతో ఈమెను అంతఃపురమునఁ బ్రవేశపెట్టుడుము. అట్లు గాదేని, యీమెను తండ్రికడకుఁ బంపివేయుట యుండనే యున్నది.

రాజు:—గురువులవారి యిచ్చచొప్పున నగుఁగాక.

పురోహితుఁడు:—అమ్మా నావెంట రమ్ము.

శకుంతల:—భగవతీ, భూదేవీ - నాకు నీలోనికి దారియిమ్ము (అని యేడ్చుచు పురోహితునితోను, తపస్వులతోను గూడిపోవును.)

రాజు:—(శాపముచేత విస్మృతిపాలై శకుంతలంగూర్చియే చింతించుచుండును.)

(నేపథ్యమున)

ఆశ్చర్య మాశ్చర్యము.

రాజు:—(విని) ఏమై యుండు నిది?

పురోహితుఁడు.—(ప్రవేశించి విస్మయముతో) దేవా, అద్భుతము జరిగినది!

రాజు:—ఏమైనది?

పురోహితుఁడు:—దేవా! కణ్వశిష్యులు మరలఁగానే,

తే. నిజవిధి విపాకమును వినిందించుకొనుచు
దోర్లతిక నెత్తి రోదింపఁదొడఁగె బాల;

రాజు:—ఆవల. ఆవల నేమి జరిగినది?

పురోహితుఁడు:—

అతివగా జ్యోతియొకఁ డింతిసలమికొని య
దృశ్యమై పోయె నప్సర స్తీర్థసరణి.

(అందఱు నాశ్చర్యపడుచున్నారు.)

రాజు:—స్వామీ! ఆమె మా చేత మున్నే నిరాకరింపఁబడినది. ఈ విషయమున వృథాతర్కములతో నిప్పు డేమి ప్రయోజనము? తమరు విశ్రమింపుఁడు.

పురోహితుఁడు:—రాజా! నీకు విజయమగుఁగాక (అని నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు:—వేత్రవతీ! మా స్వాంతము కలంతచెందినది. విశ్రాంతిగృహమునకు దారి చూపుము.

ప్రతీహారి:—ఇటు. ఇటు. దేవరవారు.

రాజు:—(ఆత్మగతము)

ఆ. స్మృతి యొకింత లేదు ఋషికన్యఁ గన్నట్లు
డాసినట్లు చెల్మి చేసినట్లు
ఐన హృదయమిప్పు డారాటపడుఁ ద్వ్యక్త
చెలువనుఘలు నమ్మఁజేయఁ బోలె.

(అందఱు నిష్క్రమింతురు.)

## ప్రవేశకము

[స్థలము - నగరిలో రాజవీథి]

(అంత, నాగరికశ్యాలుఁడును, పెడరెక్కలు విఱిచికట్టిన యొక పురుషుని తోడ్కొని యిద్దఱు కావలివాండ్రును ప్రవేశింతురు.)

కావలివాండ్రు:—(కొట్టి) ఒరే, ముచ్చోడా, చెప్పరా, యాడఁ దొరికిందిరా నీకు, పబువుగారి ఉంగరం - గతనాలకట్టులో యేలినవోరి పేరు చెక్కింది—ఏందీ యవ్వారం? చెప్పరాంటే.

పురుషుఁడు:—(భయ మభినయించుచు) కొట్టాకండి, సాములారా! నాను దొంగను కాను, తోడుపోతోణ్ని కాను, నేను ఎప్పుడు ఆలాంటిపనికి బొయ్యేవాణ్ణి కాదండీ.

కావలివారిలో (ప్రథముఁడు):—అయితే నీవు బలే పుగోయితపు అయ్యోరివని దానంచేసి దణ్ణం పెట్టాడంట్రా రాజుగారు నీకు.

పురుషుఁడు:—అమ్మో, అమ్మో, అది కాదు నాను చెప్పేది. నేను శక్రావతారం రేవులో శాపలు పట్టుకుంటూ బతికే జాలరోణ్ణి సామీ.

ద్వితీయుఁడు — ఇప్పుడు నీకులం గోత్రం ఏందని అడిగినామంట్రా మేము. చెప్తుండావే బలే తెంపుగా.

స్యాలకుఁడు:—సూచక! తాళండిరా, వాణ్ణి కొస్త వైనంగా మాటచెప్పనీయండి. అడ్డదుడ్డాలు పెట్టవాకండి నడమంతరంలో.

ఇద్దఱు:—అవుఁలే బావా, మేం ఊరకుంటాం. (ఊరకుందురు.)

స్యాలకుఁడు:—ఒరేయ్, నీవు చెప్పేదేందో చెప్పరా, వింటాం.

పురుషుఁడు:—అయ్యోవ్, అదీ నేననేది. మారాజులు ఇనండి చెప్తాను. నేను వలా, గాలాం, ఊత ఈలాంటి వాట్తో చాపాజల్లా పట్టుకొని కుటుంబరాన్ని యెల్లదోసుకుంటుండా, నాయనోయ్.

స్యాలకుఁడు:—(నవ్వి) ఒరేయ్, నీది తెలివైన బతుకురా.

పురుషుఁడు:—మఱి, యినండి పబువులు—

గేయము

విడవరాదు బాబూ, కులవృత్తి—విడవరాదు బాబూ
బెడఁదలు — ఇడుమలు వేవేలున్నా,
విడవరాదు బాబూ, కులవృత్తి—విడవరాదు బాబూ
నెత్తురుచూస్తే — ఉత్తలపడియెడు
మెత్తమనసు — బాపలుకూడా
కత్తుకకోయరె — కోరె మేఁకలకు

స్యాలకుఁడు:—ఎట్లా? బలే వాడివే, అవతలేమైందిరా?

పురుషుఁడు:—అయ్యో, మొన్నొకనాడు ఒక యెఱ్ఱశాపని బట్టుకొని తుంటాలు తుంటాలుగా తరుగుతుణ్ణా, నాయనోయ్, తరుగతుంటే దాని కడుపులో ఈ ఉంగరం రవలు కళ్లుసెదిరేటట్లు చిటచిట మెరొస్తు నాకు దొరికింది. ఆమైన దీన్ని తీసుకోచ్చి అమ్ముతుంటే ఈళ్లు పట్టుకొన్నారు దేవుడో; జరిగిం దిది. ఉన్నమాట సెప్పినా. చంపితే చంపండి, వదత్తే వదలండి.

స్యాలకుఁడు:—ఒరే నీవేమో జాలగోడివే. అంతమటుకు నిజంరా, కంపుకొట్టు కుంటూ గోతమొగం ఏసుకొని వైనంతైనం లేకుండా ఉండావురా, కాని నీకీ వుంగరం ఎట్టా దొరికిందో ఇచారించాల్సిందేమో ఖాయం. నగరిలోకి పోదాం ఈడగాదురా.

కావలివాండ్రు:—నిజవే, ఒరే, నీ మూటంతా ఆడ యిప్పుదుగానిలే, పదండి, పదండి.

(అందఱు పరిక్రమింతురు.)

స్యాలకుఁడు:—సూశక, సానేటుగాగాని ఉండేరు, మీ మనసో, జాగ్రత్త దర్వాజా కాడ కబడ్దాక్, నేను పోయి ఆ ఉంగరంమాట పబువుగారికి మనించేసి వారేమంటారో తెలుసుకోనొస్తా.

ఇరువురు:—మా రాజుకు బావమీద కరుణకలగాలని మొక్కుందాం రా.

(బావమఱఁది నిష్క్రమించును.)

ప్రథముఁడు:—బావ బోయి చాలాసేపైంది. ఇంకా రాలేదే.

ద్వితీయుఁడు:—తొందరపడ్తే యెట్రా? సమయంచూచి కాదంట్రా యేలినోరి దగ్గరకు బోవాలి.

ప్రథముఁడు:—జానుగ, ఈణ్ని కాజేసేదేమో ఖాయం. ఈడిజుట్టుకు పూలు సుట్టాలని నా చేతులు పురపురలాడ్తుండాయోయ్. (అని పురుషుని జూపును.)

పురుషుఁడు:—అయ్యోయ్, నన్ను పున్నాన్కి చంపబాకండయ్యా — దణ్ణం పెట్టుకుంటా పిల్లలుగలోణ్ని.

ద్వితీయుఁడు:—వస్తుండాళ్లే పబువుకాడ్నుంచి ఉత్తర్వుతీసుకొని. ఒరే, నిన్ను జంపి గద్దలకేస్తాంరోవ్, రానీ బావ.

ప్రథముఁడు:—బావ 'ఉ' అంటే చాలు, చచ్చినాడే ఈడు.

స్యాలకుఁడు:—(ప్రవేశించి) వీణ్ని ఒదలేయండ్రా. ఉంగరం యీడికి దొరికింది నిజమే. దొంగ కాదురా యీడు, ఒదిలేయండి పాపం.

ప్రథముఁడు:—బావమాటకు తిరుగాడదది?

ద్వితీయుఁడు:—చచ్చి బతికాడ్రా యీడు. (అని పురుషునికట్లు విప్పును.)

పురుషుఁడు:—(బావకు మ్రొక్కి) సావీ! నీయా, నా పాణాలు, నా బిడ్డలు, నా భార్య అంతా నీయా.

బావ:—ఇదిగోరా నీకు ఉంగరంఖరీదు అంతా ఇనాంయిచ్చేడ్రా పబువుగారు. (అని పురుషునికి ధనమిచ్చును.)

పురుషుఁడు:—(మ్రొక్కి తీసికొని) ఎంతడబ్బురా కళ్లు తిరగుతోన్నాయి. నన్ను బతికించారు, సావీ.

సూచకుఁడు:—బతికించే దేందిరా? కొరతవేసినోణ్ని దింపి, ఏనుగెక్కిస్తే—బలే అదుష్టంరా నీది.

జానుకుఁడు:—వుంగరంమీద రాజుగోరికి మఁ ఖెమఁణసు గావాలె. పూరాగా యినాం ఇచ్చేడు.

బావ:—వుంగరంకోసరం ఇవ్వడం కాదురా. పబువుగా రంతలోతుమాసి కదా, ఉంగరం చూచేటప్పటికి ఆమయిన నిలువుసొగై పోయినాడ్రా. ఎవరో మనసుకలిసినోళ్లు మతికొచ్చి నట్టుండదిరా. ఉరక కన్నీళ్లు పెట్టుకొన్నాడు.

సూచకుఁడు:—ఏల్నివారికి మంచిమేలే చేసినావు బావా.

జానుకుఁడు:—ఈ జాలారివాడికోసం కాదంట్రా యీ కల్యాట్లంతా

(అని అసూయతో పురుషుని జూచును.)

పురుషుఁడు:—అయ్యోయ్. మీరు ఇందుల్లో సగం తీసుకోండి. మీ రుణం నాకెందుకు.

జానుకుఁడు:—మంచోడ్రా వీడు.

స్యాలకుఁడు:—ఒరే నాకిప్పుడు నీవు బలేస్నేహం అయ్యావు, సారాయి సాక్షుంబెట్టుకొని మనంస్నేహం అవుదాంరా. రండి పోదాం కల్లంగడికి.

పురుషుఁడు:—బలే, బలే.

(అందఱు నిష్క్రమింతురు.)

# షష్ఠాంకము

——:o:——

## స్థలము-I - నగరిపైని యాకాశము.

(అంత గగనయానమున, సానుమతి యను నచ్చర ప్రవేశించును.)

సానుమతి:—సాధువులు స్నానముచేయునంతవఱకు, నిర్ణయానుసారము అప్సర స్తీర్థసాన్నిధ్యమున నుంటిని. ఇఁక నిపుడు ఆ రాజర్షి వృత్తాంతము ప్రత్యక్షీకరించుకొందును. మేనక చుట్టఱికముచే శకుంతల నాకు శరీరము వంటిదైనది. ఆమెచే ఈవఱకే పుత్త్రికానిమిత్త మాదేశింపఁబడియుంటిని. (అంతటఁ గలయఁజూచి) ఇది యుత్సవకాలముకదా! రాజగృహ మేల తదారంభము ఏమియు లేకయున్నది? ప్రణిధానముచేత నే సర్వము గనుంగొను ప్రభావము నాకుఁ గలదు. కాని, చెలికత్తె యాదరము నేను సంభావింపవలసియున్నది. అగుఁగాక, తిరస్కరిణీ విద్యచే నదృశ్యనై ఈ యుద్యానపాలికలప్రక్క నిలిచి యంతయుం గనిపెట్టెదను (నాట్యముచే దిగి నిలుచును) (తరువాత మావిమొగ్గ తిలకించుచు ఒక చేటియు, దానివెంట మఱియొకతెయుఁ బ్రవేశింతురు.)

ప్రథమ:—

తే. కోయిలకులమ్ము నలరింపఁ జేయుదాని
జీవిత సదృక్షమగుదాని పూవుఁదఱికి
మధుపపద భగ్నమగుదాని మావిననను
నెమ్మిఁ గనుఁగొందు ఋతుమంగళమ్ము గాఁగ.

ద్వితీయ:—సఖీ! పరభృతికా! ఏమిటే నీలోనే నీవు మాటాడుకొనుచున్నావు?

ప్రథమ:—మధుకరికా! చూతాంకురముచూచి పరభృతిక ఉన్మత్తకాదటే.

ద్వితీయ:—(హర్షమున, వడిగా సమీపించి) ఎంతలో వచ్చినదే మధుమాసము!

ప్రథమ:—మధుకరికా! నీ మదవిభ్రమగీతములకు సమయము ఇదేకదా!

ద్వితీయ:—సఖీ! నన్నుఁ బట్టుకొనుము. పాదాగ్రమున నిలిచి, మదనదేవార్చనము కొఱకు మావిమొగ్గ కోసెదను.

ప్రథమ—పూజాఫలము సగమిత్తువేని అట్లే చేసెదను.

ద్వితీయ:—నీవు అడుగవలెనటే, మనదేహములే వేఱుకాని, మనకు ప్రాణ మొక్కటియే కదా (చెలిమీఁద నాని చూతాంకురము కోయుచున్నది.) ఓహో!

వికసింపక పోయినను, తొడిమఁ ద్రుంపఁగానే మావిమొగ్గ పరిమళించు చున్నది. (కపోతహస్తము పట్టి.)

క. చూతాంకురమా! నిన్ను గృ
హీతశరాసునకు మరున కిత్తు, నతనికిఁ
బ్రీతిఁ బంచాధిక వి
ఖ్యాతశరం బగుమ యేయఁగా భామినులన్.

(తెరను జిమ్ముకొని కంచుకి కోపముతోఁ బ్రవేశించి)

కంచుకి:—ఒడలు మఱచితిరా యేమి? ప్రభువుగారు వసంతోత్సవము ప్రతిషేధించి యుండఁగా, మావిమొగ్గలు కోయఁదొడంగుచున్నారా మీరు!

ఉభయులు:—(భయముతో)అయ్యా! క్షమింపుము. ఏలినవారియాజ్ఞ మే మెఱుఁగము.

కంచుకి:—వసంతమునఁ బూచు తరువులు, తదాశ్రయములైన పక్షులును, తలఁదాల్చి యున్నట్టి యేలినయాజ్ఞ మీరు వినలేదా? చూడుఁడు,

చ. నెఱిగొని మావిమొగ్గ చిరనిర్గత మయ్యు రజంబుపూన, ద
క్కురవక ముచ్ఛ్రితిన్ గనియుఁ గోరకతన్ విడదింత, సీతుకా
రరిగినను బికమ్ము రుతినాఁపు గళమ్మునఁ, దూణినుండి వే
సర కఱలాగియున్ మరుఁడు జంకి శరం బుపసంహరించెడున్.

సానుమతి:—ఇందు సందేహము లేదు. ఆ రాజర్షి మహాప్రభావుఁడు!

ప్రథమ:—ఆర్యా, ఏలినవారి బావమఱఁది మిత్రావసువుగారిచే మేము అమ్మగారికొలువున నియోగింపఁబడి కొలఁది దినములే యైనది. నాఁటఁగోలె ఉద్యానవన రక్షణము గావించుచు నిటనే యున్నందున ఏలినవారియాజ్ఞ నెఱుఁగము.

కంచుకి:—మంచిది. ఇఁకమీఁద నిట్లొనర్పకుఁడు.

ఉభయులు:—ఆర్యా, కౌతుక మగుచున్నది. ఏలినవారు వసంతోత్సవము ఏల వలదనిరో, మాకు వినఁదగినదేని సెలవిండు.

సానుమతి:—ఉత్సవప్రియులుకదా మనుష్యులు! ప్రభువు దీని నిలిపివైచుటకు ప్రబల మైన కారణ ముండవలయును.

కంచుకి:—ఈ వఱకే పెక్కండ్రెఱిఁగియున్నదానిని మీకుఁ జెప్పకేమి? ప్రభువు గారికి శకుంతలను నిరాకరించుటవలనఁ గలిగిన లోకాపవాదము మీ చెవిని బడలేదా?

ఉభయులు:—వినియున్నాము. మిత్రావసువుగారివలన ఏలినవారు ఉంగరము చూచు నంతవఱకు జరిగిన వృత్తాంతమును.

కంచుకి:—అట్లైన, మీకు చెప్పవలసినది యించుకయే కలదు. అంగుళీయక దర్శనమున ఎప్పుడు విస్మృతి తొలఁగినదో అప్పటినుండియు రహస్యమున పెండ్లియాడిన యా పుణ్యవతిని శకుంతలను మఱపుచే నిరాకరించితిని అని దేవరవారు పశ్చాత్తాపముపాలై యున్నారు.

మ. తిలకింపండు మనోజ్ఞదృశ్యముల, మంత్రిశ్రేణికిం దొంటియ
ట్టుల కొల్వీయఁడు, శయ్యపైఁ బొరలు చెల్లో రేలు వేగించు, లే
మలతో సంతిపురిం యథోచితముగా మాటాడఁగాఁ బోయి కాం
తల నూర్పేరను బిల్చి దక్షిణత డిందం ముగ్ధుఁడై చింతిలుం.

సానుమతి:—ఇది నాకు మిక్కిలి ప్రియమైన యుదంతము.

కంచుకి:—ఈ విమనస్కతచేతనే వసంతోత్సవము ఆఁపివేయఁబడినది.

ఉభయులు.—యుక్తమే. (తెరలో) దేవా, ఇటు, ఇటు.

కంచుకి:—(చెవి యొగ్గి) దేవరవారు ఇచ్చటికే విజయం చేయుచున్నారు. ఎవరిపని వారు చూచుకొనుఁడు.

ఉభయులు:—ఆలాగే. (నిష్క్రమించుచున్నారు.)

(అంత, పశ్చాత్తాప సదృశ వేషముతో రాజును, విదూషక ప్రతీహారులును ప్రవేశించుచున్నారు.)

విదూషకుఁడు:—దేవా, యిటు, యిటు.

కంచుకి:—(రాజుం గని) అహో! కొందఱ యాకృతులు ఎల్లదశలయందును రమణీయముగానే యుండును. అట్లుకదా, వ్యాకులితుఁడయ్యును దేవరవారు ప్రియదర్శనులుగానే యున్నారు.

మ. ఒడమెల్ పెక్కులుమాని, బంగరుకడెం బొక్కండె డాకేల వే
ర్పడఁగాఁ దాలిచి, మోవి కెంపుజిగి నిశ్వాసమ్ములం దూలఁ, గూ
ర్ఘ జాగం జేయువగం గనుల్ బడల, నెంతో స్రుక్కియుం గ్రాలు స
తేఁజు స్వీయప్రభ, శాణ ఘృష్టవరరత్నం బట్లు సంప్రేక్ష్యుఁడై.

సానుమతి:—(రాజుం జూచి) ప్రత్యాదేశ విమానితయయ్యు, ఈతనికొఱకు శకుంతల క్లాంతయగుట యుక్తముగానే యున్నది.

రాజు.—(పరధ్యానముతో మెల్లఁగాఁ బరిక్రమించి)

తే. మృగనయన తొల్త నంతగా మేలుకొలుప
నిదురవీడని నా పాడుహృదయ మిపుడు
ప్రియఁదొఱంగిన యనుతాప వేదనమ్ము
ననుభవించుటకొఱకు మేల్కొనిన దకట!

సానుమతి:—తపస్విని శకుంతల భాగధేయము నిట్టిదే!

విదూషకుఁడు.—(అపవారించి) ఈతనిని శకుంతలావ్యాధి మరలఁ బైకొన్నది. అది కుదుర్చు టెట్లో యెఱుఁగకున్నాను.

కంచుకి:—(సమీపించి) జయమగుఁగాత దేవరవారికి. ప్రమదవనభూములఁ బరికించి వచ్చినాను. మహారాజుగారు ఇచ్చకొలఁది వినోదస్థానముల విహరింపవచ్చును.

రాజు:—వేత్రవతీ! మా మాటగా అమాత్యులు ఆర్యపిశునులవారితోఁ జెప్పుము. "ప్రొద్దుపోయి నిద్దురలేచినందున, ధర్మాసన మధ్యాసించుటకు మేము రాఁదలఁచుకొనలేదు. అమాత్యులు విచారించిన పౌరవ్యవహారములు మా యొద్దకు వ్రాసిపంపుఁడు" అని.

ప్రతీహారి:—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

రాజు:—వాతాయనా! నీవును నీపనిఁ జూచుకొనుము.

కంచుకి:—చిత్తము. (అని నిష్క్రమించును.)

విదూషకుఁడు:—ఇచ్చట పురుగులేకుండఁ జేసితివి. ఇప్పుడు అంత చలియు, అంత యెండయు లేని యీ యుద్యానవనప్రదేశమున డెందము నానందపెట్టుకొనుము.

రాజు:-(నిట్టూర్పుతో) వయస్యా, సందుచూంకిన ననర్థములు సంసిద్ధములు అన్నమాట ముమ్మాటికి నిక్కముసుమా! ఎందువల్ల ననఁగా,

క. మునితనయా ప్రణయస్మృతి
వినిరోధించిన తమమ్ము వీడెను మది; య
మ్మనసిజుఁడు సఖుఁడ! నను నే
యను చూతశరమ్ము వింట ననుసంధించెన్.

విదూషకుఁడు:- నీ వూరకుండుము. నేనే దుడ్డుఁగఱ్ఱచే మదనబాణము నాశనము చేసెదను. (అని కఱ్ఱయెత్తి చూతాంకురము పడఁగొట్టఁ బోవును.)

రాజు:- (చిఱునవ్వుతో) మేలు! నీ బ్రహ్మవర్చసము ప్రసిద్ధమే, మిత్రమా! నా ప్రేయురాలి నించుక యనుకరించు తీవెలయందు చూపును వినోదింపఁజేయుటకు నే నెక్కడఁ గూర్చుందునోయి.

విదూషకుఁడు:- ఆసన్నపరిచారిక చతురికతో మీరే చెప్పితిరి కదా, "మాధవీలతామండపమున ఈ పూటఁ గడపెదము. మేము చిత్రఫలకమునందు స్వహస్తముతో వ్రాసిన శకుంతలాప్రతికృతిని తెమ్ము" అని.

రాజు:- హృదయమును వినోదింపఁజేయఁదగిన చోటు అట్టిదే. అచ్చటికే దారి తీయుము.

విదూషకుఁడు:-వయస్యా, ఇటు, ఇటు.

(రాజు పరిక్రమించును, సానుమతి అనుగమించును.)

## స్థలము III

### (మాధవీలతా మండపము)

విదూషకుఁడు:- ఇదే మణిశిలాపట్టసనాథము, మాధవీలతామండపము. ఇది ఉపచార రమణీయతచే నిస్సందేహముగా స్వాగతముచెప్ప మనలఁ బ్రతీక్షించునదివోలెఁ గానవచ్చుచున్నది. అట ప్రవేశించి నీవు కూర్చుందువు గాక. (ఇరువురు ప్రవేశించి కూర్చుందురు.)

సానుమతి:- ఈ తీఁగెయొద్దనుండి శకుంతలప్రతికృతిం దిలకించి భర్తయొక్క బహుముఖమైన యనురాగ మామెకు నివేదించెదను. (అని యట్లే చేయును.)

రాజు:- వయస్యా, శకుంతల ప్రథమవృత్తాంత మంతయు నిప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. అది నేను నీకుఁగూడఁ జెప్పితిని. నేను బ్రియురాలిని నిరాకరించిన సమయమున నీవు నా సమీపమున లేవు. అంతకు ముందుకూడ ఎప్పుడుగాని నీవు మాటలలో బ్రేయసిపేరైన నెత్తియుండలేదు. నా వలెనే నీవును విస్మృతిపాలైతివా యేమి?

విదూషకుఁడు:- విస్మరింపలేదుగాని, అంతయుఁ జెప్పి కడపట, ఇవి నవ్వుమాటలు, నిజము కావు అని నీవే పలికితివి. మంటిముద్దవంటి బుద్ధిగల నేను అట్లే అనుకొంటిని. ఇంతకును కావలసినది కాకమానదు గదా!

సానుమతి:- అది యట్టిదే.

రాజు:- (ధ్యానించి) వయస్యా, నన్ను రక్షింపుము.

విదూషకుఁడు - ఇది యేమి? ఇట్లు డిల్లపోవుట నీకుఁ దగదు. పురుషసత్తము లెప్పుడును శోకమునకుఁ దావీయరు. పెనుగాలికైనను పర్వతములు కంపింపవు కదా!

రాజు:- వయస్యా, నిష్కారణ నిరాకరణ దుఃఖపరవశయైన బ్రియురాలి యవస్థఁ దలఁచుకొని నేను కేవల మశరణుఁడ నగుచున్నాను.

ఉ. ఏ నిరసించిపొమ్మన, నిజేష్టజనమ్ముల వెన్నడింపఁ బోఁ
గా, నటె నిల్వు రాకుమని కణ్వనిభుం డదలింప శిష్యుఁ, డా
చాన కఠోర నర్మరల జాలిఁ గనుంగొనె నశ్రువారి క
న్గోనలజాఱఁ, దత్స్మృతి నను న్దహియించు విషాక్తశల్యమై.

సానుమతి:- అహో, స్వార్థపరత్వమన నిట్టిదే కదా. ఈయన సంతాపమునకు నేను సంతోషించుచున్నాను.

విదూషకుఁడు:- నేను ఊహించెదను, ఎవఁడో గగనచారి ఆమెను గొనిపోయి యుండునని,

రాజు:- ఆ పతిదేవతను అన్యుఁ డెవఁడు అంట సాహసించును? మీ సఖిని కన్నతల్లి మేనక యనికదా వింటిని. ఆమె సహచారిణులచే ప్రియురాలు కొనిపోఁబడి యుండునని హృదయము ఆశంకించుచున్నది.

సానుమతి:- ఆశ్చర్యపడవలసినది మఱపునకుఁగాని ఎఱుకకు కాదు;

విదూషకుఁడు:- అట్లైన, ఆమెతో నీకు సమాగమము శీఘ్రకాలముననే కలుగును.

రాజు:- అది యెట్లు?

విదూషకుఁడు - తల్లిదండ్రులు భర్తృవియోగదుఃఖితను దుహితను చిరకాలము చూడ నొల్లరుకదా!

రాజు:- వయస్యా,

తే. కలయొ, మాయయొ, మదికిఁ బాటిలిన భ్రమయొ,
అంతతోఁ నంతమైన పుణ్యంపు ఫలమొ!
అది గడచిపోయెఁ; గ్రమ్మఱిల్లద; యటయ్యు
తలఁపువెల్లులు పాఱు నిస్తటము లగుచు.

విదూషకుఁడు:- అట్లు కాదు, తప్పక ప్రాప్తింపవలసిన యర్థము అచింతనీయముగా సమాగత మగును. దానికి ఉంగరమే నిదర్శనము.

రాజు:- (ఉంగరమును జూచి) అయ్యో, ఇది అదుర్లభస్థానమునుండి తొలఁగి శోచనీయముగా నున్నది.

తే. అంగుళీయమ్మ! నీ పుణ్య మల్పతరమ
నాయదియపోలె ఫలపరిణతిఁ దలంప,
అరుణ నఖరమ్యమైన తదంగుళులను
దావలము కాంచియును బ్రచ్యుతమ్మ వగుట.

సానుమతి:- ఈ యుంగరము అన్యహస్తగతమై యుండెనేని నపుడు సత్యముగా శోచనీయముగా నుండెడిదే.

విదూషకుఁడు:- వయస్యా, నీపేరు చెక్కిన యీ ముద్రిక యే సందర్భమున నామె హస్తసంసర్గమునకుఁ బాత్రము కావింపఁబడినది?

సానుమతి:- ఇది తెలిసికొన నాకును కౌతుకము గలదు.

రాజు:- వయస్యా, వినుము. అపుడు రాజధానికి మరలుచున్న నన్నుఁ జూచి ప్రియురాలు కన్నీటితో "ఆర్యపుత్త్రుని సమాగమము మరల నెంతకాలమునకో" అని యడిగినది.

విదూషకుఁడు:- ఆవల?

రాజు:- నేను ఈ నాముద్రికను ప్రియురాలివ్రేల నుంచుచు ఇట్లు చెప్పితిని.

తే. దినదిన మ్మొక్కటొకటగా దీనిమీఁది
యస్మదాఖ్యాక్షరములు పాయక గణింపు,
మవి ముగియునాఁటికి మదీయ మంతిపురము
నొనర నినుఁ జేర్చువాఁడు వచ్చును, లతాంగి.

ఈమాట తీవ్రమగు మఱపుచే నెఱవేర్పనైతిని.

సానుమతి:- రమణీయమగు నీగడవు విధిచే విపరీతము కావింపఁబడినది.

విదూషకుఁడు:- అయితే, జాలరివాఁడు కోసిన యెఱ్ఱచేఁప కడుపులోనికి ఈ ఉంగర మెట్లు వచ్చినదో?

రాజు:- నీ సఖి, శచీతీర్థమునకు మ్రొక్కుచుండఁగా చేతివ్రేలినుండి జాఱి ప్రవాహములోఁ బడిపోయినది.

విదూషకుఁడు:- ఓహో! అట్లనా?

సానుమతి - అంగుళవలననే అధర్మభీరుఁడగు నా రాజర్షికి తపస్వికన్యను శకుంతలను జేపట్టితినా అని సందేహము. కాకున్న ఇట్టి యనురాగమునకు అభిజ్ఞాన మవసరమా?

రాజు:- ఈ ఉంగరము నుపాలంభించెదను.

విదూషకుఁడు:- (ఆత్మగతము) వయస్యుఁడు, వెఱ్ఱివాఁడగుచున్నాఁడు.

రాజు:-

తే. కెంపుజిగి నీను నునువ్రేళ్ల కేలు వాసి
ఉదకమున నేలకూలితో యుంగరమ్మ! (ఔను)
గాన మెఱుంగదుగా కచేతనము, తెలిసి
యేటికవమతి చేసితి నేను బ్రియను.

విదూషకుఁడు.- (ఆత్మగతము) హా! నన్ను ఆఁకలి పీఁకుకొని తినుచున్నది!

రాజు:- చెలీ, తెలియక విడనాడి పశ్చాత్తప్తహృదయుఁడగుచున్న యీ జనునకు పునర్దర్శన మనుగ్రహింపవా?

చతురిక:- (తెరఁ జిమ్ముకొని ప్రవేశించి) ఇదిగో, చిత్రగతయైన పట్టంపుదేవి.

(అని చిత్రఫలకమును జూపుచున్నది.)

విదూషకుఁడు:- మేలు, మేలు. ఈ మధురాకృతి ఎంత దర్శనీయముగా నున్నది! భావములు ఎంతచక్కఁగాఁ దోఁచుచున్నవి! ఇందలి నిమ్నోన్నతములలో నాచూడ్కి తొట్రిలుచున్నట్లున్నది!

సానుమతి:- ఆహా! ఈ రాజర్షి రచనానైపుణ్యము! నెచ్చెలి నాముందర నున్నట్లు తలఁచుచున్నాను.

రాజు:-

తే. ఏది యెది చిత్రమున యందదహృద్య మగునొ
యద్ది యది దిద్ది తీర్ప హృద్య మగుచుండెను,
ఇట్టులయ్యు రేఖామాత్రమే యగపడు
పడఁతిలావణ్య మీచిత్రఫలకమందు.

సానుమతి:- సరిగానే యున్నది ఈ మాట, అనుతాపమున నతిశయిల్లిన నెయ్యము నకును అనవలేపమునకును.

విదూషకుఁడు:- ఇందు ముగ్గురు పుణ్యవతులు కానవచ్చుచున్నారు. అందఱు దర్శనీయులే. వీరిలో పూజ్యురాలు శకుంతల యెవ్వతెయో?

సానుమతి:- ఇతఁడు చెలిరూపు చూచియెఱుఁగఁడు. ఈతనిదృష్టి నిరర్థకము.

రాజు:- నీవు ఎవ్వరని అనుకొనుచున్నావు?

విదూషకుఁడు:- సడలి విరులు జాఱుచున్న క్రొమ్ముడితోను, చెమ్మట గ్రమ్ముచున్న నెమ్మొగముతోను, అవనతములైన భుజలతికలతోను, అవసేకస్నిగ్ధతరుణపల్లవమైన యామ్రవృక్షముప్రక్క యించుక యలసినదివోలె ఆలిఖితయైయున్న యీ పుణ్యవతి శకుంతల యనియు, మిగిలిన యిర్వురు నామె చెలికత్తెలనియు తలంచుచున్నాను.

రాజు:- నిపుణుఁడవోయి నీవు. ఇదిగో ఇట మదీయసాత్త్వికభావ చిహ్నముకూడ.

తే. చెమ్మగిలు వ్రేళులు వినివేశింపఁబడుట
రేఖల యుపాంతమునను మాలిన్య మదిగొ,
కను మదె వయస్య! రంగు పొక్కిన తెఱంగు
కెరలి మద్బాష్ప మొకఁడు చెక్కిలిని బడుట.

చతురికా! ఈ వినోదస్థానము సగమే వ్రాసితిని. నీవుపోయి వర్ణికలను గొనిరమ్ము.

చతురిక:- అయ్యా, మాధవ్యా, చిత్రఫలక మించుకసేపు పట్టుకొనుము. నేను పోయి రంగులబరణి తీసికొనివచ్చెదను.

రాజు:- నేనే దీనిం బట్టుకొనెదను. (అని పట్టుకొనును. చతురిక నిష్క్రమించును.)

తే. దగ్గఱిలిన సాక్షాత్ప్రియ దలఁగఁద్రోసి
చిత్రగతఁ బ్రియ నిటు ప్రశంసించు నేను

త్రోవ, నమృతప్రవాహమహా ధునిని దాఁటి
మరు మరీచిక కొలయు పామరుఁడనైతి.

విదూషకుఁడు:- (ఆత్మగతము) నిజముగా నితఁడు నదినిదాఁటి యెండమావులలో దగ తీర్చుకొనఁ గోరుచున్నాఁడు. (ప్రకాశముగా) వయస్యా! ఇందు ఇంకను లిఖింపవలసినది యేమి కలదు?

సానుమతి:- సందేహము లేదు. ఏ యే ప్రదేశములు, నెచ్చెలికి మనోరమములో వానివాని వ్రాయఁగోరుచున్నాఁడు.

రాజు:- వయస్యా, వినుము.

మ. మునుముగ సైకతలీనహంస మిథునమ్ముగ మాలినిఁ గూర్తు, చెం
త నిషణ్ణంబులగ లిఖింతు గిరికన్యాతాత పూతాంఘ్రులన్;
తనువుం గొమ్మలవ్రేలు వల్కములక్రిందన్ లేడి శృంగమ్ముతోఁ
దన డాకన్నును గోఁకికొన్ హరిణకాంతన్ దీర్ప నుంకించెదన్.

విదూషకుఁడు:- (ఆత్మగతము) అట్లైనయెడల, వయస్యుఁడు ఈ చిత్రఫలకమును వ్రేలాడు మీసాలు గడ్డాలుగల జడదారిగుంపుతో నిండించును.

రాజు:- వయస్యా, నేను వ్రాయఁదలఁచుకొన్నది యొకటి విస్మరించితినిజుమా శకుంతల యలంకృతులలో,

విదూషకుఁడు:- అది యేమి?

సానుమతి:- వనవాసమునకును, సుకుమారతకును, ఏది తగినదో, యది.

రాజు:-

ఉ. చెక్కిలిఁ గేసరమ్ములు స్పృశింప సవృంతముగా శిరీషముగ
జక్క లిఖింపనైతి చెవిసందున; నట్టులె వ్రాయనైతి స
మ్యక్కమనీయ శారద సుధాంశు మరీచి మనోజ్ఞమాచుఁ దె
ల్పెక్కు మృణాళసూత్రమును నింపునిభాస్యకుచాంతికమ్మునన్.

విదూషకుఁడు:- ఎందువల్ల ఈమె చెంగలువతేకుంబోని తనకేలితో మొగము చాటు చేసికొని, మిగుల బెదరుఁగొనియున్నది? (సావధానముగా నిరూపించి) తెలిసినది. ఇదిగో, తొత్తుకొడుకు, పూఁదేనియదొంగ తుమ్మెదదుండగీఁడు పూజ్యురాలి మొగముమీఁది కెగురుచున్నాఁడు.

రాజు:- ఈ దుష్టుని వారింపుము.

విదూ:- అవినీతుల ననుశాసించుటకు నీవే సమర్థుఁడవు.

రాజు:- సరే, అయ్యా! కుసుమలతాప్రియాతిథీ! ఇచ్చట నేల పరిశ్రమక్లేశమునకుఁ బాల్పడియెదవు?

ఆ. విరినిప్రాలి, దగను బీడితయయ్యు నీ
మధుపసాధ్వి నీకు మరులుకొనుచు
నీవులేక తాను ద్రావదు పూఁదేనె
నిన్నె యెదురుచూచు చన్ని దిశల.

సానుమతి:- ప్రభువుగారు దీనిని సగౌరవముగా వారించినారు.

విదూ:- ఈ జాతి పొమ్మన్న పోవునది కాదు. మొండిది.

రాజు:- ఓయీ, నా యాజ్ఞ ననుసరింపవేని - వినుము.

ఉ. బాలరసాలసాల నవపల్లవమ ట్లతిలోభనీయ, మేఁ
గ్రోలితి దేని మున్ను దయకోల్పడ కల్లరతోత్సవమ్ములన్
బాలిక మోవిబింబ మది బంభర! నీవు స్పృశించితేని నీ
కీ లఘువృత్తి కిష్టె విధియింతు సరోరుహ గర్భబంధమున్.

విదూ:- ఇట్టి కఠోరశిక్ష కెవఁడు భయపడకుండును? (పరిహసించి-తనలో) ఇతఁడు ఇపుడు వెఱ్ఱివాఁడైనాఁడు. ఈతని సంసర్గముచే నేనును అట్టివాఁడనే యైతిని. (ప్రకాశము) వయస్యా, ఇది చిత్రమాత్రము సుమా.

రాజు:- ఏమీ! చిత్తరువేనా ఇది?

సానుమతి:- నేనును ఇంతదనుకఁ దెలియనైతిని. యథాలిఖితము ననుభవించుచున్న ప్రభువుమాట చెప్పవలయునా?

రాజు.- వయస్యా! నీవు చేసినపని యేమి? ఈ పురోభాగిత తగునా?

తే. ప్రియను ప్రత్యక్షముగఁ గన్నరీతిఁ దన్మ
యాంతరంగమ్మునతో హర్ష మనుభవించు
నాకు స్మృతిఁగొల్పి యకట! కాంతాలలామఁ
జిత్రముగ వెండి చేసితివై చితె? వయస్య!
(అని కన్నీరు నించును.)

సానుమతి:- ఈ విరహమార్గము పూర్వాపరవిరోధి. అపూర్వము.

రాజు:- వయస్యా! అంతములేని యీ దుఃఖము ఎన్నాళ్లు అనుభవింతును!

ఆ. కలలనేని కలియు కలిమి దూరమ్మయ్యె,
రాత్రులుం బ్రజాగరముల చేత,

చిత్రగతను జూడఁ జింతింతు నేనియు,
అశ్రువృష్టి దాని కడ్డపడును.

సానుమతి:- వయస్యా, శకుంతలకైన ప్రత్యాదేశదుఃఖము నీచే సర్వథా తుడిచివేయఁబడినది.

చతురిక:- (ప్రవేశించి) జయము, జయము ఏలినవారికి. రంగులపెట్టె తీసికొని యిచ్చటికి వచ్చుచుంటిని.

రాజు:- అంతట?

చతురిక:- త్రోవలో, తరళికతోఁ గూడి వసుమతీదేవిగారు వచ్చుచుండి ఆర్యపుత్రునకు ఇది నేనే యిచ్చెదనని నా చేతినుండి బలాత్కారముగా లాగుకొన్నారు.

విదూ:- నీ అదృష్టము మంచిది. ఆమె నిన్ను వదలిపెట్టినది.

చతురిక:- అప్పుడు చెట్టుకొమ్మకుఁ దగులుకొన్న అమ్మగారి చీరచెఱఁగు తరళిక వదలించులోన నేను తప్పించుకొని వచ్చితిని.

రాజు:- వయస్యా! దేవి దగ్గఱినది. నా మన్ననలచే దేవి గర్వితురాలు. ఈ చిత్తరువు నీవు కాపాడవలయును.

విదూ:- (చిత్రఫలకను గైకొని లేచి) 'నా ప్రాణములను' అనుము. ఈ అంతఃపుర కలహమునుండి తప్పించుకొందువేని, మేఘప్రతిచ్ఛందప్రాసాదమునుండి నన్నుఁ బిలువుము. (అని వడిగాఁ బోవుచున్నాఁడు.)

సానుమతి:- అన్యసంక్రాంతహృదయుఁడయ్యు నితఁడు పూర్వసంభావనము ఉపేక్షింపకున్నాఁడు. ఇతని సెయ్యము సడలిపోవనిది.

ప్రతీహారి (జాబు చేతపట్టుకొని ప్రవేశించి) జయము, జయము, ఏలినవారికి.

రాజు:- త్రోవలో, దేవి నేమైనఁ జూచితివా?

ప్రతీహారి:- చూచితిని. నా చేతి పత్త్రికఁ జూచి భట్టిని మరలిపోయినది.

రాజు.- కార్యజ్ఞురాలు. నా పనులకు నిరోధము కలిగింపదు.

ప్రతీహారి:- అమాత్యులవారు ఇట్లు విన్నవించుచున్నారు: "లెక్కింపవలసిన రొక్కము మిక్కుటముగా నున్నందున నేఁడు పౌరవ్యవహారము ఒక్కటియే నేను ప్రత్యవేక్షింపఁ గలిగితిని. దానిని పత్త్రికలో వ్రాసిపంపినాను. దేవరవారు చిత్తగింతురుగాక" అని.

రాజు:- పత్త్రిక నిటు చూపుము. (ప్రతీహారి చూపును.)

రాజు:- (చదువుకొని) ఏమీ - సముద్రవ్యాపారము సేయువాఁడు ధనమిత్రుఁడను సార్థవాహుఁడు ఓడమునిఁగి చనిపోయినాఁడు. అతఁడు సంతతిలేనివాఁడఁట. అతని యర్థసంచయమంతయు దివానమునకుఁ జేరవలయునని యమాత్యుఁడు

వ్రాసిపంపినాఁడు. అక్కటా! అనపత్యత కష్టముకదా! వేత్రవతీ! అతఁడు బహుధనముకలవాఁడైనందున, అతనికిఁ బెక్కురు పత్నులు ఉండఁగలరు. అం దెవ్వతెయేని గర్భవతిగా నున్నదో విచారింపు మనుము.

వేత్రవతి.- ఆతని భార్యలలో సాకేతసెట్టికూఁతునకు మొన్ననే పుంసవనము జరిగినదని వినికి.

రాజు:- సరే, తండ్రియర్థము గర్భస్థశిశువునకుఁ జెందవలయును. నీవుపోయి ఈ మాట అమాత్యునకుఁ జెప్పుము.

ప్రతీహారి:- చిత్తము. (అని తరలును.)

రాజు:- వేత్రవతీ! ఇటు రమ్ము.

ప్రతీహారి:- వచ్చినాను. ఏమి సెలవు?

రాజు:- సంతానము కలదా? లేదా? అను విచార మేల?

తే. ఇష్టబంధుజనమ్ములో నెవ్వరెవరి
కగునొ యెడఁబాటు ప్రజల కయ్యందఱకును
పాపమునఁదక్క మఱి యట్టిబాంధవుండు
పుడమి దుష్యంతుఁడని చాటఁబడును గాత.

ప్రతీ:- అట్లే చాటింపఁబడును. (పోయి మరలఁ బ్రవేశించి) దేవరవారి శాసనమును యథాకాలవృష్టినివలె అమాత్యులు అభినందించుచున్నారు.

రాజు.- (నిట్టూర్పుతో) ఇట్లేకదా సంతానహీనతచే నిరాధారులైనవారి సంపదలు మూలపురుషుని తరువాత అన్యులపా లగుచున్నవి. నా వెనుక పూరువంశ సంపదకును ఇట్టిదే గతి.

రాజు:- ఛీ! ఎంత బేలను! దగ్గఱిన శ్రేయము నవమానించితిని.

సానుమతి.- సందేహము లేదు. ఇతఁడు ప్రియసఖిని డెందమున నుంచుకొనియే తన్నుఁ దాను నిందించుకొనుచున్నాఁడు.

రాజు:- తే. విడిచితిని ధర్మపత్ని గర్భితమదాత్మ
అన్వయ ప్రతిష్ఠను హేతువైనదాని
కాలమున బీజమిడి ఫలోద్గతి ఘటిల్లు
నెడ వసుంధరవీడు మూర్ఖుఁడును బోలె.

సానుమతి.- నీ సంతతి అపరిచ్ఛిన్నము కాఁగలదు.

చతురిక:- (జనాంతికము) ఈ సార్థవాహుని వృత్తాంతముచే నేలినవారు విమనస్కులైనారు. ఊఱడించుటకు మేఘప్రతిచ్ఛందప్రాసాదమునుండి మాధవ్యయ్యను పిలుచుకొనిరా!

ప్రతీహారి:- చక్కఁగాఁ జెప్పితివి.

రాజు:- అయ్యో! దుష్యంతుని పితృదేవతలు సంశయముపాలైరికదా!

ఉ. అక్కట! యెవ్వ రీతనియనంతర మిక్కులమందు మాకు స
మ్యక్కులనక్ నివాప మిడునట్టి రటంచును మత్పితల్ నెగుల్
నెక్కొనఁ బుత్రహీనుఁడగు నేనిడు నీటను ధౌత బాష్పులై
తక్క తిలోదకమ్ములన దారు గ్రహింతురు పో నిజమ్ముగాక్.

(అని మూర్ఛిల్లును.)

చతురిక:- (ససంభ్రమము పట్టుకొని)—ఊఱడిల్లుఁడు, దేవా! ఊఱడిల్లుఁడు.

సానుమతి:- అయ్యో, దీపమున్నను చాటైనదోషముచే నితఁడు అంధకార మనుభవించుచున్నాఁడు. నేను ఇతని నిప్పుడే సంతోషింపఁ జేసెదను. అట్లు వలదు. నేను వినియుంటిని గదా! శకుంతల నూఱడించుచున్న మహేంద్రజనని చెప్పఁగా 'యజ్ఞభాగ పర్యుత్సుకులు దేవతలే ఈయన నచిరకాలముననే ధర్మపత్నిం జేకొనఁజేసెద'నని. కావున అంతదనుకఁ బ్రతీక్షించుట యుక్తము. ఈ వృత్తాంతముచే నేను ప్రియసఖిని సమాశ్వసించెదను.

(ఆకసమున కెగసి నిష్క్రమించుచున్నది.)

(తెరలో) అయ్యో, చంపుచున్నాఁడు, చంపుచున్నాఁడు.

రాజు:- (ఆలకించి) ఈ యార్తస్వరము మాఢవ్యునిదిపోలె నున్నది. ఎవఁడురా అక్కడ?

ప్రతీహారి:- (సంభ్రమముతోఁ బ్రవేశించి) రక్షింపుము, దేవా, రక్షింపుము. ఎవఁడో, దేవరవారి వయస్యుని గొంతునులిమి ప్రాణసంశయదశకుఁ దెచ్చుచున్నాఁడు.

రాజు:- ఎవఁడురా! మాణవకుని కంఠము పట్టుకొన్నవాఁడు?

ప్రతీహారి:- ఏదో సత్త్వము, కన్నులకుఁ గానరానిది, వయస్యుని ఆక్రమించి మేఘప్రతిచ్ఛందప్రాసాదము కొట్టకొనకుఁ గొనిపోయినది.

రాజు:- (లేచి) అట్లు కానేరదు. భూతములు మా గృహములనుగూడ అభిభవించునా యేమి? గాక,

తే. అనుదినము సొంతబాటుపాట్లన యెఱుంగ
నేరకయ యుండును బ్రమాదకారణముల;
ప్రజలలో నెవ్వఁ డెట్టి వర్తనమువాఁడో
సర్వము నెఱుంగ నెవ్వండు శక్తుఁడగును!

(తెరలో) అయ్యో, వయస్యా, చచ్చితిని, చచ్చితిని.

రాజు:- (గతిభేదముతోఁ బరిక్రమించుచు) మిత్రమా! భయపడకు. భయపడకు.

(తెరలో)

(మరల దానినే పఠించి) దేవా! ఎట్లు భయపడకుందును? వీఁ డెవ్వఁడో నామెడ వెనుకకు వంచి చెఱకుగడనుబోలె విఱుచుచున్నాఁడు.

రాజు:- (చూపు సారించి) ధనుస్సు, ధనుస్సు.

యవనిక:- (విల్లు పట్టుకొని ప్రవేశించి) ప్రభూ! ఇదిగో ధనువు, హస్తత్రాణసహితము.

(రాజు ధనుర్బాణములు గైకొనుచున్నాఁడు.)

(తెరలో)

శా. గొంతుం గ్రోవి విపూత్నశోణితఝురిన్ గ్రోలంగ శార్దూల మ
త్యంతోద్వృత్తిఁ మహోక్షమున్ జదుపుచాయన్ నిన్నిదే
త్రుంచెదన్;
సంత్రస్తార్త భయాపనోదపటుదీక్షన్ గేల విల్ పూను దు
ష్యంతుం బిల్వు మతండు నీకు శరణమ్మౌఁగాత మిప్పట్టునన్.

రాజు:- (రోషముతో) ఏమీ! వీఁ డెవ్వఁడో నన్నే నిర్దేశించుచున్నాడు! నిలు, నిలు, నిశాటాధమ! నీకు నేఁటితో ఆయుస్సు పూర్తియైనది. (విల్లెక్కుపెట్టి) సోపానమార్గము చూపుము.

వేత్రవతి:- ఇటు, ఇటు, దేవా!

(అందఱు వడివడిగా నడచుచున్నారు.)

## స్థలము-IV : మేఘప్రతిచ్ఛందప్రాసాదము.

రాజు:- (అంతటఁ బరికించి) ఇచట 'నెవ్వరును లేరే'

(తెరలో) అయ్యో, నేను నిన్నుఁ జూచుచున్నాను. నీవు నన్నుఁ జూడలేకున్నావు. పిల్లి పట్టుకొన్న యెలుకవలె నేను ప్రాణములపై ఆశవదలుకొన్నాను.

రాజు:- ఓరీ! తిరస్కరిణీగర్వితుఁడా! నా యస్త్రము నిన్నుఁ జూడఁగలదు. పాఱిపోక నిలువుము. ఇదిగో బాణమును సంధించుచున్నాను.

ఆ. వధ్యు నిన్ను వెదకి వధియించి శర మిదే
రక్షసేయు ద్విజుని రక్షణీయు
పాలు నీరు వేఱుపఱిచి నీటిఁ ద్యజించి
పాలుమాత్ర గొనుమరాళ మట్లు.

(బాణము సంధించుచున్నాఁడు.)

(అంతట విదూషకుని విడిచి మాతలి ప్రవేశించును - విదూషకుఁడును.)

మాతలి:—

తే. అసురులను జేసె నీకు లక్ష్యమ్ముగాఁగ
నింద్రుఁ డిటవారిపైఁ బూన్పుమీ ధనుస్సు;
సుజనులు ప్రసాదసౌమ్య దృష్టులనుగాక
శాతశరములు సారింత్రె సఖులమీఁద.

రాజు:- (అస్త్ర ముపసంహరించి) ఓహో; మాతలీ, దేవేంద్రసారథీ! నీకు స్వాగతము.

విదూ.- యజ్ఞపశువునుబోలె నన్ను మన్నింపనున్నవానిని ఇతఁడు స్వాగతముచే నభినందించుచున్నాఁడు.

మాతలి:- (చిఱునవ్వుతో) ఆయుష్మంతుఁడా! వినుము. ఇంద్రుఁడు నీ యొద్దకుఁ బంపఁగా వచ్చినాఁడను.

రాజు:- సావధానుఁడనుగా నున్నాను.

మాతలి:- కాలనేమిసంతతి దుర్జయమను దానవగణము కలదు.

రాజు:- నారదులవారు చెప్పఁగా, వినియున్నాఁడను.

మాతలి —

ఉ. వార లజయ్యు లెల్లెడ నృపాల! భవత్సఖుఁడైన వజ్రికిన్,
పోరున వారి నీవు పొలిపుత్తువటంచుఁ దలంచు నాతఁడున్;
వారక చండభానుని సవప్రభ కగ్గముకాని శర్వరీ
భూరితరాంధకారమును బూనికఁ జంద్రుఁ డపాకరింపఁడే.

కావున నీవు శస్త్రపాణివై పౌరందరము ఈస్యందన మారోహించి యిప్పుడే విజయార్థము దయచేయవలెను.

రాజు:- మఘవాని యాహ్వానముచే ననుగృహీతుఁడను. మఱి, మాఢవ్యుని విషయమున మీ రేల యట్లు చేసితిరి?

మాతలి:- అదియు మనవి సేయుచున్నాను. ఆయుష్మంతుఁడు ఏ హేతువుచేతనో, మనస్సంతాపముచే విక్లబుఁడుగా నున్నట్లు నాకుఁ దోఁచినది. కావున మిమ్ముఁ గోపింపఁజేయుటకై యిట్లొనర్చితిని. ఏలన

తే. సమిధలఁ గదల్ప నగ్ని భగ్గుమని మండు,
పడగవిప్పును పాము విప్రకృతమైన,

ప్రాయికమ్ముగ నాత్మప్రభావ మెల్ల
క్షోభనొందిన యప్పుడే చూపు జనుఁడు.

రాజు:- ఉచితమే సల్పితివి. (జనాంతికము) వయస్యా, దివస్పతియాజ్ఞ దాఁటరానిది. ఇది తెలిపి, అమాత్యపిశునునితో నా మాటగా నిట్లు చెప్పుము.

ఆ. నీమప్రతిభ యొకఁడె నేఁటి కొంతకాలమ్ము
ప్రజలనరసి ప్రోనవలయుఁ జుమ్ము
వ్యాపృతమ్ము నాదుచాప మ్మధిజ్య మి
య్యది సచివ! యిపుడు క్రియాంతరమున.

విదూ:- అట్లే కావించెదను. (నిష్క్రమించును.)

మాతలి:- ఆయుష్మంతుఁడా! ఇటు, ఇటు.

(రాజు రథ మెక్కుచున్నాఁడు. ఎల్లరు నిష్క్రమించుచున్నారు.)



# సప్తమాంకము

—:0:—

## స్థలము-I — ఆకాశము.

[అంత, రథారూఢుఁడై రాజును, మాతలియు, గగనయానమునఁ బ్రవేశింతురు.]

రాజు:- మాతలీ! ఇంద్రుని నిదేశము నెఱవేర్చినవాఁడనయ్యును, ఆతని సత్క్రియా విశేషములచే, నన్ను అనుపయుక్తునిగా భావించుకొనుచున్నాఁడను.

మాతలి:- (చిఱునవ్వుతో) ఆయుష్మంతుఁడా! మీ యిరువురకు అపరితోషము సమానమే.

తే. ఇంద్రుఁ డొనరించు నధికసత్కృతులఁ దలఁచి
ప్రథమము నిజోపకృతిని నల్పముగ నెంతు,
వెంచు నతఁడును దనదు సత్కృతి లఘువుగ
నీకడిఁది కర్జముల కెదన్ వెఱఁగుపడుచు.

రాజు:- మాతలీ, అట్లుకాదు. నన్ను వీడ్కొలుపునప్పుడు అతఁ డొనర్చిన సత్కారము మనోరథమునుగూడ దాఁటినది. దివౌకసుల సమక్షమున నన్ను తన యర్ధ సింహాసనమున నాసీనుం గావించి,

తే. తలఁపును వెలార్పకే చెంత నిలిచియున్న
సుతు జయంతుని గని నవ్వి సురవిభుండు
ఆత్మహృత్తట హరిచందనాంకితమ్ము
తాన నామెడ వైచె మందారమాల.

మాతలి:- ఆయుష్మంతుఁ డమరేశ్వరునివలన నెట్టి సత్కారమున కర్హుఁడు కాఁడు?

తే. సుఖపరాయణుఁడైన వాస్తోష్పతికిని
నాక ముద్ధృతదైత్యకంటకము రెంట;
ఇపుడు నతపర్వములు యుష్మదిషులచేత,
తొల్లి పురుషసింహుని వాఁడిగోళ్లచేత.

రాజు:- మాతలీ! ఇచ్చటను పొగడఁదగినది శతక్రతుని మహిమయే సుమా.

చ. శ్రితజనముల్ మహాద్భుతపుఁ గృత్యములన్ బొనరించుటెల్ల స
మ్మతిఁ దదధీశ్వరుల్ సలుపు మన్ననపెంపునఁ జేసి చూవె; స

న్నతసరణిన్ సహస్రకిరణుండు నిజాగ్రమునం దనూరు సు
స్థితు నొనరింపఁడే నతఁడు చీల్పఁగ నోపునె తత్తమఃఛటల్.

మాతలి:— ఇదియుఁ జక్కఁగానే యున్నది. (కొంచెము దూరము పోయి) ఆయుష్మంతుఁడా! నాకపృష్ఠప్రతిష్ఠితమైన నీ యశస్సౌభాగ్యమును దిలకింపుము.

తే. త్రిదశలీలావతు లలంకరించుకొనఁగ
మిగులు వన్నెల, సురలు నీడగు చరిత్ర
పాట కనువగు నర్థసంపదలఁ గూర్చి
అభిలిఖింత్రిదె కల్పలతాంశుకముల.

రాజు:- మాతలీ! నిన్న ఇటఁ బైకిపోవునపుడు అసురసంప్రహారోత్సుకతచేత స్వర్గమార్గము చక్కఁగాఁ జూడనైతిని. కాఁబట్టి చెప్పుము - మన మిపుడు ఏ వాయుపథమున నున్నామో?

మాతలి:—

చ. త్రిపథగయైన గంగను భరించెడు నేది నభఃప్రతిష్ఠితన్?
విపుల విభక్త రశ్మిగను వెల్గులఁ దా నడపించు నేది? ల
క్ష్మీపతి ద్వితీయ విక్రమముచేత నిరస్త తమస్క మేది? పు
ణ్యాపరవిమృగ్య మప్పరివహానిలమార్గ మిదంద్రు పండితుల్.

రాజు:- అందుచేత నేకదా, అంతరింద్రియ బాహ్యేంద్రియములతోఁగూడ నా యంతరాత్మ ప్రసన్న మగుచున్నది. (రథచక్రములఁ జూచి) మేఘమార్గమునకు దిగినారము.

మాతలి:- ఎట్లు తెలిసికొంటిరి?

రాజు:—

ఉ. ఆకులసందునన్ దిరుగులాడెడు చాతకముల్, తటిత్ప్రభా
నీక సమావృతమ్ములగు నిద్దపు మేనుల మేలిగుఱ్ఱముల్;
శీకర సార్ద్రనేములును, జెప్పక చెప్పు శతాంగ మిద్ది య
స్తోకనవాంబుగర్భమగు తోయద పంక్తిపయిన్ జరించుటల్.

మాతలి.- ఇఁక క్షణములోన ఆయుష్మంతుఁడు నిజాధికార భూమి నుండఁగలఁడు.

రాజు:- (క్రిందఁ జూచి) మాతలీ, వడివడిగా దిగుటచేత, మనుష్యలోకము ఆశ్చర్యముగాఁ గానవచ్చుచున్నది.

మ. గిరిశృంగమ్ములు పైకిఁబో దిగెఁడుమాడ్కిన్ భూమి చూపట్టెడిన్;
దరువుల్ పత్త్రవిలీనతన్ దొఱఁగు స్కంధంబుల్ గనన్ వచ్చుటన్;
బొరిఁ గన్పట్టుఁ దనుత్వ నష్టసలిలంబుల్ నిమ్నగల్ గ్రమ్మఱన్;
ధరణీచక్ర మెవండొ రువ్వినటులై నాపజ్జ కేతెంచెడిన్.

మాతలి:- చక్కఁగాఁ దిలకించితివి. (సబహుమానముగా విలోకించి) పృథ్వి, ఎంత రమణీయముగా నున్నది!

రాజు:- మాతలీ! ఏ పర్వతము ఇది? పూర్వాపరసముద్రములఁ జొచ్చి సంధ్యాకాల మేఘమువలె కనక రసనిష్యందిగా నున్నది.

మాతలి:- ఆయుష్మంతుఁడా! ఇది హేమకూటము పేరి కింపురుషపర్వతము. తపస్సులకు ఉత్కృష్టమైన సిద్ధిక్షేత్రము. చూడుము:

క. అజసుతుఁడు మరీచికి నా
త్మజుఁడు, ప్రజాపతి, సమస్తదైవత దైత్య
వ్రజగురువు, కశ్యపుం డిట
నిజపత్నింగూడి తపము నియతిన్ జలుపున్.

రాజు:—అట్లైన, శ్రేయముల నతిక్రమింపరాదు. భగవంతునకు కశ్యపునకుఁ బ్రదక్షిణించి పోఁగోరెదను.

మాతలి:- ఉత్తమమైన తలంపు. (ఇరువురును నడచుచున్నారు.)

రాజు:—

తే. చక్రనేముల స్వనము లేశమును లేదు,
కానరాదు రజం బింతయైనఁ జదల,
భూతలస్పర్శ మీఱ లాఁపుటను జేసి
దిగియు దిగనట్లెయున్న దీ దివ్యరథము.

మాతలి:- ఇంతయే విశేషము. శతక్రతునకును ఆయుష్మంతునకును.

రాజు:- ఇట మరీచాశ్రమ మెచ్చట?

మాతలి:- (చేతితోఁ జూపుచు)

శా. పుట్టన్ మేనిసగమ్ము డింద, ఫణినిర్మోకం బురస్సీమఁ జూ
పట్టన్, జీర్ణలతాప్రతాన వలయ స్పర్శంబు కంఠంబు నో
పెట్టన్ బక్షికులాయయుగ్ బహుజటాన్వీతాంసుఁ డీతండు క
న్పట్టున్ స్థాణువుఁబోలె నిశ్చలత భాస్వన్నిష్ఠితో దృష్టియై.

రాజు:- కష్టతపసున కీయనకు నమస్కారము.

మాతలి.- (పగ్గములు బిగియఁబట్టి) అదితి పెంచి పెద్దచేసిన బాలమందారతరువులు గల ప్రజాపతి ఆశ్రమము ప్రవేశించినారము.

రాజు:- స్వర్గమునకంటె నిర్వృతికరముగా నున్నది యీ స్థానము. అమృతసరస్సులో మునిఁగిన ట్లయితిని.

## స్థలము-II — మారీచాశ్రమము.

మాతలి:- (రథము నిలిపి) దిగుదురుగాక.

రాజు:- (దిగి) మఱి మీరు?

మాతలి:- రథము నిలిపితిని. నేనును దిగెదను. (అట్లు చేసి) ఆయుష్మంతుఁడా! ఇటు. ఇటు. ఋషుల తపోవనభూములఁ దమరు చిత్తగింతురుగాక!

రాజు:- విస్మయాపాదకముగా నున్నది యీ దృశ్యము.

చ. సురతరువాటులందును నసుల్ భరియించుట గాలిఁగ్రోలి; క
ర్బుర నళినీరజః కపిశ పుణ్యజలమ్ములఁ గ్రుంకులాట; ధ్యా
నరతి మణీతలమ్ముల; ద్యునారుల సన్నిధి సంయమంబు, లే
సిరికయి లాఁతివారు తపసింతురొ, యందె తపింతు రిమ్మునుల్.

మాతలి:- మహాత్ముల కోరికలు - పైకిఁబైకి పోవునవి కదా! (పరిక్రమించును) - (ఆకాశమున) అయ్యా, వృద్ధశాకల్యా! భగవంతులు మారీచులవా రేమి సేయుచున్నారు? ఏమనుచున్నావు? అదితి మహాదేవి పతివ్రతాధర్మములఁ గూర్చి ప్రశ్నింపఁగా, నామెకును, ఇతర మహర్షి పత్నులకును చెప్పుచున్నా రనియా?

రాజు:- అట్లైన, మనము అవసరము ప్రతీక్షింపవలసి యున్నది.

మాతలి:- (రాజును జూచి) ఈ యశోకవృక్షమూలమున ఆయుష్మంతుఁడు క్షణము ఉండుఁగాక, నేను పోయి మీ రాక గురువులవారికి నివేదించుటకు సందు వెదకెదను.

రాజు:- అట్లే యుండెదను. (అని నిలిచి యుండును, మాతలి నిష్క్రమించును.)

రాజు:- (నిమిత్తమును సూచించి)

క. వదలితి మనోరథార్థము
లదరెద వేటికిని బాహువా! వ్యర్థముగా
మొదట నవధీరితమ్మయి
ప్రిదిలిన శ్రేయమ్ము క్రమ్మఱిల్లుట కలదే.

(తెరలో)

వలదు. వలదు. చాపలము వలదు. అహో, ఇతఁడు తన స్వభావమును చూపనే చూపినాడు.

రాజు:- (చెవి యొగ్గి) ఇది యవినయమునకు స్థానము కాదు. ఎవరిని వీరు శాసించుచున్నారు? (శబ్దము వచ్చువంకఁ జూచి విస్మయముతో) అహో! తాపసస్త్రీలు ఇర్వురతోఁ గూడి వచ్చుచున్న అబాలసత్త్వుఁ డీ బాలుఁ డెవ్వఁడో?

ఆ. తల్లిపాలు సగము త్రావెడు నంతలో
సింహశిశువుజూలు చేతఁబట్టి
మెలియఁబెట్టి బలముకొలఁది లాగెడి వీఁడు
దానితోడనాడు తమకమునను.

(అంత యథానిర్దిష్టవ్యాపారుఁడు బాలుఁడు ఇరువురు తాపసస్త్రీలతో ప్రవేశించును.)

బాలుఁడు:- ఆవులించు, సింహపుపిల్లా, ఆవులించు. నీ పండ్లు నేను లెక్క పెడ్తాను.

ప్రథమ:- ఓరీ, అవినీతుఁడా! మన బిడ్డలంబోని జంతువుల ఏల బాధించెదవురా! నీ దుండగికము పెరుఁగుచునే యున్నదే! ఋషిజనులు నీకు సర్వదమనుఁడని పేరుపెట్టుట తగియే యున్నది.

రాజు:- ఏమిది! ఈ బాలకునియందు ఔరసపుత్త్రునియందుంబోలె నా మనస్సు నెయ్యమూనుచున్నది. నిజముగా అనపత్యతయే యీ వాత్సల్యమునకుఁ గారణము.

ద్వితీయ.- సర్వదమన! కొదమను నీవు వదలనియెడల ఈ తల్లిసింహము నీ మీఁదికి దూఁకును జుమా!

బాలుఁడు:- (చిఱునవ్వుతో) అమ్మో! బయంగా వుందే? (అని యధరోష్ఠమును జూపుచున్నాఁడు.)

రాజు:—

క. బీజస్థితినున్న మహా
తేజమువలెఁ దోఁచు నా మదికి నీ కొమరుం
డోజ స్ఫులింగదశ సమి
ద్రాజి నపేక్షించు నల్లదహనుఁడువోలెన్.

ప్రథమ:- వత్సా! ఈ సింగపుఁగొదమను వదలుము. నీకు వేఱొక యాటవస్తువు నిచ్చెదను.

బాలుఁడు:- ఏదీ. దాన్ని తెచ్చీ. (అని చేయి చాఁచుచున్నాఁడు.)

రాజు:- (చూచి విస్మయముతో) ఏమిది? ఈతని చేతిలోఁ జక్రవర్తి లక్షణములుకూడఁ గానవచ్చుచున్నవి.

తే. ఇష్టవస్తువును గ్రహింప నితఁడు చాఁచు
కరము వ్రేళ్ళ్రోలి సందులు గానరాక
రాజిలు, నుషస్సునన్ గ్రొత్తరక్తి విరియు
నల యలక్ష్య పత్త్రాంతరైకాబ్జ మట్లు.

ద్వితీయ.- సువ్రతా! వీనిని వట్టిమాటలచే మఱపింప నేరము. పోయి నా పర్ణశాలలో ఋషికుమారుఁడు మార్కండేయుని మట్టినెమిలి రంగులువేసినది యున్నది. ఈతనికి దానిం దెచ్చియిమ్ము.

ప్రథమ:- ఆట్లే. (అని నిష్క్రమించును.)

బాలుఁడు:- అంతదాకా దీనితోనే ఆడుకుంటాను. (అని తాపసస్త్రీనిజూచి నవ్వును.)

రాజు:- ఈ దుడుకనియెడ, నేను సస్పృహుండ నగుచున్నాను.

మ. అనిమిత్తమ్మగు వింతనవ్వులను దంతాంకూరముల్ గానరా,
ననభివ్యక్త మనోజ్ఞ వర్ణములనొయ్యన్ బల్కుచున్, వేగఁ బై
కొన ముద్దాడి తనూజులిచ్చ నొడిలోఁ గూర్చుండఁగాఁ గూర్మిఁద
త్తనుధూళిన్ మలినీభవత్ వపువులౌ తండ్రుల్ కృతార్థుల్గదా!

తాపసి:- వీఁడు నన్ను సరికొనఁడు. (పార్శ్వమున రాజుం గాంచి) భద్రముఖుఁడా! ఇటురమ్ము. వీఁడు బాల్యచేష్టలచే ఈ సింహపుఁగొదమను బాధించుచున్నాఁడు. ఈతని గట్టిపట్టు దయచేసి విడిపింపుము.

రాజు:- (చిఱునవ్వుతో డాసి) ఓయీ! మహర్షి పుత్త్ర!

తే. ఆశ్రమ విరుద్ధవర్తివై యయ్య! యేల
జననసిద్ధమ్ము సత్త్వసంశ్రయ సుఖమ్ము
నైన సంయమ మిట్లు దూష్యంబొనర్తు
వసిత ఫణి శాబకము చందనాగ మట్లు.

తాపసి:- సౌమ్యుఁడా! వీడు ఋషికుమారుఁడు కాఁడు.

రాజు:- ఆకార సదృశమైన యీతని చేష్టయే యితఁడు ఋషికుమారుఁడు కాఁడని తెలుపుచున్నది. ఐనను, ఉన్నచోటుం బట్టి మేమట్లు ఊహించితిమి.

(వారు కోరినట్లు చేయుచు, బాలుని స్పర్శమువలని సుఖము పొంది, ఆత్మగతము)

తే. ఎవ్వని కులాంకుర మొ వీని నెనసినంత
హర్ష మిట్టిది కలిగె నా యంగములకు,
ఏ సుకృతి యంగభవుఁడో యీ భాసురాంగుఁ
డతని కితఁడెట్టి నిర్వృతి నిడఁగలండో?

తాపసి:- (ఉభయులఁ జక్కఁగాఁ జూచి) ఆశ్చర్య, మాశ్చర్యము.

రాజు:- ఏమి?

తాపసి:- మీ రిర్వురు నొక్కపోలికగా నున్నారు. పైఁగా అపరిచితుఁడైన యార్యుని యొద్ద నితఁడింత మాలిమిగా నున్నాఁడు, అనియు వింతపడుచున్నాను.

రాజు:- (బాలుని ఉపలాలించుచు) అమ్మా, ఇతఁడు మునికుమారుఁడు కాఁడేని ఇతని వంశ మెయ్యది?

తాపసి:- ఇతనిది - పూరువంశము.

రాజు:- (ఆత్మగతము) ఇతఁడు నాతో ఏకాన్వయుఁడా? అందువలననే యీమె నా పోలికగా నున్నాఁడని అన్నది. పౌరవులకు వార్ధకమున కులవ్రతముకదా వనవాసము.

క॥ ధరణీ భరణార్థం బె
వ్వరు తొల్త సుధాసితోరు భవనము లాశిం
తురో; వారె పిదప నెలకొం
దురు నియతవ్రతముకొఱకు ద్రుమ మూలములన్.

(ప్రకాశము) ఈ స్థానము ఆత్మగతిచే మనుష్యులకు రారాని చోటుకదా?

తాపసి:- మీ రన్నది సరియే. అప్సరస్సంబంధముచేత, ఈ పిల్లవానితల్లి యిచట దేవ గురుని తపోవనమునఁ బ్రసవమైనది.

రాజు:- (ఆత్మగతము) ఆహా! ఇది నాకు మరల ఆశ కలిగించుచున్నది. (ప్రకాశము) ఈతనితల్లి యే రాజర్షిపత్ని.

తాపసి:- ఆ ధర్మదార పరిత్యాగిపేరు ఎవరు ఉచ్చరింపఁ దలంతురు?

రాజు:- (స్వగతము) ఈ కథయు నాకే తాఁకివచ్చుచున్నది. ఈ పిల్లవానితల్లి పేరు అడుగుదునా? కూడదు. పరదారలపేరు లడుగరాదు.

తాపసి:- (మట్టినెమిలితో ప్రవేశించి) ఓరీ సర్వదమనా! శకుంతలావణ్యమును జూడు.

బాలుఁడు:- (చూపు సారించి) ఏదీ, మా అమ్మ.

స్త్రీలిద్వురు:-(నవ్వుకొని) మాతృవత్సలుఁ డీతఁడు నామసామ్యమున భ్రమపడినాఁడు.

ద్వితీయ:- వత్సా, నే నన్నది మట్టినెమిలి యందము చూడుమని.

రాజు:- (ఆత్మగతము) ఏమి? వీని తల్లిపేరు 'శకుంతల'యా? ఒకటేపేరు ఎందఱకో యుండును. ఈ ప్రస్తావమును మృగతృష్ణికయుంబోలె నాకు విషాదమునకే యగునా?

బాలుఁడు:- ముద్దుగానుంది చిన్ని నెమలి నాకు. (అని ఆటబొమ్మను తీసికొనును.)

ప్రథమ:- (ఉద్వేగముతో) అయ్యో, వీని మనికట్టున రక్షాబంధము లేదే!

రాజు:- కలవరము వలదు. ఇది కుమారుఁడు సింగముతో పెనంగులాడునపుడు జాఱిపడినది. (అని తీసి యీయఁబోవును.)

ఇర్వురు - తాఁకకుము. తాఁకకుము. దీని నితఁ డెట్లు తాఁకి పట్టుకొనినాఁడు!

(ఆశ్చర్యమున బొమ్మునఁజేతు లుంచుకొని ఒండొరులఁ జూచుకొనుచున్నారు.)

రాజు:- అమ్మా, ఏల నన్ను వారించితిరి?

ప్రథమ:- మహారాజా! వినుము. ఇది 'అపరాజిత' అనునోషధి. వీని జాతకర్మ సమయమున మారీచభగవంతు లొసఁగినారు. ఇది క్రిందఁబడినయెడల వీని తల్లిదండ్రులును, వీఁడును తక్క మఱెవ్వరు నెత్తరాదు.

రాజు:- ఒకవేళ ఎత్తిన!

ప్రథమ:- తత్‌క్షణము పామై కఱచును.

రాజు.- ఇది మీరు ఎప్పుడేని ప్రత్యక్షముగా చూచినారా?

ఇరువురు:- అనేక పర్యాయములు.

రాజు:- (హర్షముతో తనలో) మనోరథము పూర్ణమైయుండఁగా, ఏల నే నిపుడు ఆనందింపరాదు. (బాలుని కవుంగిటఁ జేర్చుచున్నాఁడు.)

ద్వితీయ:- సువ్రతా! రమ్ము. ఈ వృత్తాంతము నియమవ్యాపృతకు శకుంతలకు నివేదింతము. (అని నిష్క్రమింతురు.)

బాలుఁడు:- నన్ను విడు. అమ్మవద్దకు పోవాలె.

రాజు:- పుత్త్రకా! నాతోఁ గలసియే మీ యమ్మను సంతోష పెట్టుదువులే.

బాల:- మా నాన్న దుష్యంతుఁడు. నీ వెవ్వరు?

రాజు:- (చిఱునగవుతో) ఈ వివాదమే నన్ను నమ్మించుచున్నది.

(తరువాత ఏకవేణీధర శకుంతల ప్రవేశించును.)

శకుంతల:- వికృతి నొందవలసిన దశయందుఁగూడ సర్వదమనుని యోషధి ప్రకృతి విడలేదని వినియు, నా భాగ్యమున నాకు నమ్మకము కుదురకున్నది. గాక, ఇదియంతయు సానుమతి చెప్పినట్లే యగును గాఁబోలు.

రాజు:- (శకుంతలఁ జూచి) ఓహో, ఇదే యీ పుణ్యవతి శకుంతల.

ఆ. మలినవసనయుగళ, మహితవ్రత కృశాస్య
పెనఁచుకొన్న యేకవేణియు నయి
విమల శీల, బాల, విరహవ్రతము దీర్ఘ
మదయు నన్నుఁగూర్చి యాచరించు.

శకుంతల:- (పశ్చాత్తాప వివర్ణుని, రాజుం జూచి) ఇతఁడు ఆర్యపుత్రునివలె లేఁడు; మఱి యెవ్వఁ డీతఁడు రక్షామంగళవంతుని నా కుమారుని గాఁగిటఁ బొదివికొని మైలపఱుచుచున్నాఁడు?

బాలుఁడు:- (తల్లిం జేరి) అమ్మా, ఎవఁడో యితఁడు పరాయివాఁడు నన్ను పుత్రుఁడని కాఁగలించుకొంటున్నాడు.

రాజు:- ప్రేయసీ! నీపట్ల నేను జూపిన క్రౌర్యమును అనుకూలముగానే పరిణమించినది. ఇపుడు నేను నీచేత ప్రత్యభిజ్ఞాతుఁడనుగా నెఱుఁగుట కతన;

శకుంతల:- (ఆత్మగతము) హృదయమా! ఊఱడిల్లు మూఱడిల్లుము. దైవము మచ్చరము మాని కరుణఁ జూపినది. ఇతఁడు ఆర్యపుత్రుఁడే!

రాజు:—

తే. భాగ్యమున జ్ఞప్తిమరలి విభ్రాంతి తొలఁగ
ఎదురఁదోఁచితి సుముఖి! నా కిపుడు నీవు
వడి విధుంతుదు నగ్రహ మెడలినంత
హిమకరుని యోగమెనయు రోహిణియుఁ బోలె.

శకుంతల:- జయము. ఆర్యపుత్రునకు. (అని సగము మాటలోనే సిగ్గుచే సబాష్ప కంఠయై విరమించును.)

రాజు:- సుందరీ!

ఆ. జయపదమ్ము బాష్పజలముచే బ్రతిషిద్ధ
మైన, దయిత! జయము యందినాఁడ,
సంస్క్రియానుపేత సమపాట లాధర
పుటము నీదుముద్దుమోము చూచి.

బాలుఁడు:- అమ్మా, ఎవరే యీయన.

శకుంతల:- వత్సా, నీ భాగధేయము నడుగుము.

రాజు:- (శకుంతల పాదముల వ్రాలి)

మ. అవమాన మ్మొనరించినాఁడనని కాంతా! చింతిలంబోకు; విం
త విమోహమ్మదో మన్మనమ్మున సముత్థమ్మయ్యె నవ్వేళ: ని
ట్లవుఁజు మ్ముగ్రతమ స్స్వభావులకు శ్రేయఃప్రాప్తులన్ వృత్తి; నే
త్రవిహీనుండు శిరస్స్రజంబు ఫణియన్ భ్రాంతిం దలంగింపఁడే?

శకుంతల:- (కన్నీటితో) లేలెమ్ము. ఆర్యపుత్రా! సుచరిత ప్రతిబంధకమైన నా పురాకృతము ఆ దినములలోఁ బరిణతికి వచ్చినది. లేకున్న సదయుఁడైన యార్యపుత్రుఁడు నాయెడ అట్లు ప్రవర్తించునా? (రాజు లేచును.)

శకుంతల:- మఱి, దుఃఖభాజనమైన యీ జనము ఆర్యపుత్రునకు మరల నెట్లు స్మృతికి వచ్చినదో?

రాజు:- ఈ విషాదశల్యమును పెకలించివైచి - యావలఁ జెప్పెదను.

మ. మునుమోహమ్మునఁ దావకోష్ఠశ్రమదమ్మున్ బద్ధబిందుక్రమం
బును గన్నీటిని దేని నేఁ దుడువనో పూఁబోఁడి! యా వక్రప
క్ష్మ నిలీనమ్మగుదాని బాష్పమును జక్కన్ నేఁడు పోఁద్రోచి య
య్యనుతాపంబు తలంగి ధూతదురితుండౌహాఁడఁ బ్రాణేశ్వరీ!

(అని యట్లే సేయుచున్నాఁడు.)

శకుంతల:- (నామముద్రికను జూచి) ఆర్యపుత్రా! ఇది యా యంగుళీయకమే కదా!

రాజు:- ఔను. ఇది దొరకుటచేతనే కదా స్మృతికలిగినది.

శకుంతల:- ఈ యుంగరము నా కపకృతి గావించినది. ఆర్యపుత్రుని నమ్మింపఁబూనిన సమయమున నగపడక.

రాజు:- అట్లైన, లత, ఋతు సమవాయచిహ్నమును కుసుమమును ధరించుఁగాక.

శకుంతల:- దీనియందు నాకు విశ్వాసము లేదు. ఇది యార్యపుత్రుఁడే ధరించుఁగాక.

మాతలి:- (ప్రవేశించి) ఆహా! అదృష్టవశమున ధర్మపత్నీ సమాగమముచేతను, పుత్రముఖ దర్శనముచేతను ఆయుష్మంతుఁడు వర్ధిల్లుచున్నాఁడు.

రాజు:- సుహృత్సంపాదిత మగుటచే నా మనోరథము మధురతరముగా ఫలించినది. మాతలీ, యీ విషయము ఆఖండలునకు తెలియదుకదా!

మాతలి:- (చిఱునవ్వుతో) ఈశ్వరులకుఁ బరోక్ష మొకటి కలదా? రమ్ము. ఆయుష్మంతుఁడా! మారీచభగవంతులు నీకు దర్శనమీ నున్నారు.

రాజు:- శకుంతలా! పుత్రుఁ బట్టుకొనుము. నిన్ను ముందుంచుకొనియే భగవంతులను సందర్శింపఁ గోరుచున్నాను.

శకుంతల:- ఆర్యపుత్రునితోడ గురుల సన్నిధికి పోవుటకు నాకు బిడియముగా నున్నది

రాజు:- సిగ్గిలకుము. అభ్యుదయకాలమున నిట్లే చేయవలయును. రమ్ము.

(అందఱును పరిక్రమింతురు.)

## స్థలము-III — మారీచులవారి పర్ణశాల.

(అంత అదితితోఁగూడ ఆసనస్థులై మారీచులవారు ప్రవేశింతురు.)

మారీచులు.- (రాజువంకఁ జూచి) దాక్షాయణీ!

మ. జగతీరక్షణధుర్యుఁ డీనృపుఁడు దుష్యంతాభిధానుండు, సం
యుగ మూర్ధమ్మున నగ్రయాయి నెఱనెయ్యుండౌ భవత్సూనికిన్;
మగువా! యీతనివిల్లు పెల్లడరి ధర్మద్వేషులన్ బీఁకెనొ
క్కఁగఁ, గేలన్ శతకోటి కేవల మలంకారమ్ము జంభారికిన్.

దాక్షాయణి:- ఈతని యాకృతిచేతనే ప్రభావము సంభావింపఁదగి యున్నది.

మాతలి:- ఆయుష్మంతుఁడా! పుత్రప్రీతి సూచించు లోచనములతో దేవజనకులగు వీరు నిన్నుఁ జూచుచున్నారు. చేరువకుఁ బొమ్ము.

రాజు:- మాతలీ,

మ. గురుతన్ ద్వాదశధావిభక్తమగు వెల్గుం గాంచె నేజంట, య
ధ్వరభాగేశు జగత్త్రియాధిపతి నుత్పాదించె నేజంట, క్ర
చ్ఛుఱ బ్రహ్మాధికుఁడైన యా పురుషుఁ డేజంటన్ జనింగాంచె, న
య్యిరువుర్ దక్షమరీచి సంభవులు వీరే! స్రష్ట కేకాంతరుల్.

మాతలి:- ఔను.

రాజు:- (సమీపించి) వాసవనియోజ్యుఁడు, దుష్యంతుఁడు మీ ఇర్వురకుఁ బ్రణమిల్లుచున్నాఁడు.

మారీచుఁడు:- వత్సా! చిరకాలము మహీమండలముఁ బాలింపుము.

అదితి:- అప్రతిరథుఁడవు కమ్ము.

శకుంతల:- పుత్రునితోఁగూడ మీ పాదములకు వందన మొనర్చుచున్నాను.

(అని యట్లు సేయును.)

మారీచుఁడు:—

క. పతి దేవేంద్రసమానుఁడు,
సుతుండల జయంతనిభుఁడు, సుచరిత్రరో! నీ

కితరమ్ము తగదు దీవన,
క్షితిఁ బేర్కొంగనుమ యాశచీదేవివలెన్.

అదితి:- పుత్త్రీ! పతికి బహుమతవు కమ్ము. అవశ్యము నీ పుత్త్రుఁడు ఈ చిరంజీవి ఉభయ కుల దీపకుఁడు అగుఁగాత. కూర్చుండుఁడు.

(అందఱు ప్రజాపతికెదురఁ గూర్చుందురు.)

మారీచుఁడు:- (ఒక్కొక్కరి నిర్దేశించి)

క. పతిదేవ, శకుంతల; స
త్సుతుండితఁడు; సుకృతివీవు; చొప్పడితిరి సు
స్థితి ముగురు నొకట భాగ్యా
యతి శ్రద్ధాధన విధిత్రయమ్మును బోలెన్.

రాజు:- స్వామీ! ఇష్టప్రాప్తి ముందు; దర్శనము వెనుక; తమ యనుగ్రహ మపూర్వము కదా! చిత్తగింపుఁడు.

తే. తొలుతఁ బువ్వుపూయు నావెన్క ఫలముపండు,
మొదల మేఘోదయమ్మగుఁ, బిదపవృష్టి,
క్రమమిది నిమిత్తనైమిత్తికముల కెందు
త్వత్ప్రసాదమునకుమున్నె వఱలు సిరులు.

మాతలి:- విధాతలు అనుగ్రహించు తెఱఁ గిట్టిది!

రాజు:- స్వామీ! ఈమీ సేవకురాలిని గాంధర్వమున వివాహమాడి కొంతకాల మునకు బంధువులు నాయొద్దకు తోడ్కొనిరాఁగా, స్మృతివైకల్యముచే నిరాకరించి తమ సగోత్రులు కణ్వులవారియెడ నేను అపరాధనైతిని. అవల యంగుళీయక దర్శనముచే ఈయింతిని పెండ్లియైతినని యెఱిఁగితిని. ఇది యంతయు నాకుఁ జిత్రముగాఁ దోఁచుచున్నది.

క. ఎదుట గజమున్నఁ గాదని
యది యరిగినపిదప సంశయంపడి, మఱి త
త్పదగతిఁ గని, గుఱితించిన
చదురుంగనె, మన్మనః ప్రసారం బనఘా.

మారీచుఁడు:- వత్సా! కణ్వులవారియెడ అపచరించితి నని చింతింపకుము. నీకు మఱపు కలుగుట యుపపన్నమే—వినుము.

రాజు:- అవహితుఁడనై యున్నాను.

మారీచుఁడు:- ఎప్పుడు నిరాకరణవ్యగ్రస్వాంత శకుంతలను అప్సరస్తీర్థమునుండి తీసికొని మేనక దాక్షాయణియొద్దకు వచ్చినదో అప్పుడే నేను ధ్యానముచేఁ దెలిసికొంటిని. "దుర్వాసుని శాపముచే సహధర్మచారిణిని తపస్విని ఈమెను నీవు ప్రత్యాదేశించితి వని, అన్యహేతువున కా"దని. ఆ శాపమునకు అవధి అంగుళీయదర్శనమువఱకే.

రాజు:- (ఉచ్ఛ్వాసముతో) నేను అపవాదమువలన ముక్తుఁడ నైతిని.

శకుంతల:- (ఆత్మగతము) ఆహా! భాగ్యవిశేషము, నిర్నిమిత్తముగా నిరాకరింపలేదు ఆర్యపుత్త్రుడు నన్ను; అప్పుడు నేను శాపగ్రస్తనగుటయే యెఱుఁగను. పతి యెడఁబాటుచే శూన్యహృదయనుగా నున్నయపుడు శాపము ప్రాపించి యుండును. అందువలననే భర్తకు ఉంగరము చూపుమని చెలులు నాతో చెప్పిరి.

మారీచుఁడు:- (శకుంతలను జూచి) కుమారీ! నీకిపుడు యథార్థము తెలిసినదికదా! సహధర్మచారిపట్ల నీ కింక కినుక తగదు. చూడుము.

మ. స్మృతిఁగోల్పుచ్చుచు శాపనిష్ఠురత పేర్మిన్ ద్యక్తుఁవై తీపు నీ
పతిచే నాఁడు, విముక్తమోహుఁడగు తత్ప్రాణేశుపైఁ బ్రాభవా
యతి నీ కిట్లొనగూడె నేఁడు; సుచరిత్రా! మాపుటద్దమ్ములో
ప్రతిబింబింపని చాయ నిర్మలమునన్ బాటిల్లు చందమ్మునన్

రాజు:- స్వామీ, వీఁడుకదా నా వంశము నిలుపవలసినవాడు.

మారీచుఁడు:- అట్లే, ఇతఁడు భావికాలమున చక్రవర్తి కాఁగలఁడని తెలిసికొనుము.

చ. అతివిషమమ్ములన్ సమమయై చను తేరునఁ దీర్ణవారిధియై
ద్రుతగతి గెల్చు నప్రతిరథుం డితఁ డుర్వర నేడు దీవులన్,
శ్రుతుఁ డితఁ డిందు 'సత్త్వదమనుం' డన సత్త్వములన్
దమించుటన్,
ధృతి 'భరతుండు' నాఁ బరఁగు నీపయి నీతఁడు విశ్వభూభృతిన్.

రాజు:- భగవంతులగు తమచే సంస్కారముఁ బడసిన ఏవియందు మే మేది యాశింప రాదు?

అదితి:- స్వామీ! పుత్త్రికామనోరథ ప్రాప్తివృత్తాంతము సవిస్తరముగ పరిచారకులచేఁ గణ్వులవారికి ఎఱింగింపుఁడు. దుహితృవత్సల- మేనక ఇచ్చటనే యున్నది- నన్నుఁ బరిచరించుచు.

శకుంతల:- (ఆత్మగతము) భగవతి నేననుకొన్నదే చెప్పినది.

మారీచుఁడు:- తపఃప్రభావముచే నిదియంతయు కణ్వులవారికి సువిదితమే.

రాజు:- అందువలననేకదా వారు నన్నుఁ గోపింపరు.

మారీచుఁడు:- అట్లైనను, ఈ మీ ప్రియసమభియోగము వారికిఁ జెప్పిపంపవలయును. ఎవఁడురా అక్కడ?

శిష్యుఁడు:- (ప్రవేశించి) స్వామీ, నేనున్నాను.

మారీచుఁడు:- గాలవా! ఇప్పుడే నీవు గగనమార్గమునఁ బోయి పూజ్యులగు కణ్వుల వారికి నామాటగా ప్రియ మావేదింపుము. 'పుత్త్రవతి శకుంతల శాపావసానమున లబ్ధస్మృతియైన దుష్యంతునిచేఁ బ్రతిగ్రహింపఁబడినది' అని.

శిష్యుఁడు:- చిత్తము. (అని నిష్క్రమించును.)

మారీచుఁడు:- వత్సా! నీవును అపత్యదారసహితముగా నీ సఖుఁడు ఇంద్రుని రథ మెక్కి రాజధానికిఁ బయనము కమ్ము.

రాజు:- భగవంతుల యాజ్ఞ.

మారీచుఁడు:- (రాజుం జూచి)

ఉ. వేలుపు ఱేఁడు నీప్రజకు వృష్టి యవారిగఁ గూర్చుఁగాత, అ
వ్వేలుపులన్ మఖక్రియలపెంపున నీ వలరింతు గావుతన్;
లోలత మీరలి ట్లుభయలోక ముదావహ మాననీయ కా
ర్యాళినిమగ్నులై యుగసహస్రములన్ దరలింత్రు గావుతన్.

రాజు:- స్వామీ! యథాశక్తి శ్రేయస్సుకొఱకు యత్నించెదను.

మారీచుఁడు:- వత్సా! నీకు ఇంకను ఏమి ప్రియము గావింతును?

రాజు:- స్వామీ! ఇంతకంటెను అనుగ్రహము కలదా? ఐనను భగవానుని కరుణవలన నిది యగును గాక.

(భరతవాక్యము)

చ. ప్రకృతిహితార్థమై నృపుఁడు వర్తిలుఁగాత నిరంతరమ్ము; నా
రక జగతిన్ బహుశ్రుతుల ప్రాజ్యసరస్వతి పూజ్యగావుతన్;
సకలనియంత, యాత్మభువు, శక్తిసమేతుఁడు, నీలలోహితుం
డొకటఁ గృపాప్తి నాకుఁ బునరుద్భవమున్ దలఁగించుఁగావుతన్.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది మహోపాధ్యాయ శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మ
విరచితంబయిన యాంధ్రాభిజ్ఞాన శాకుంతలము
సమాప్తము.

# సవరణలు



| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 4 | 23 | ఏఁడ | ఏడ |
| 22 | 6 | దుష్యంతుఁడు | — |
| 26 | 8 | వారుకొను | ఁదారుకొను |
| 32 | 14 | వేచెడి | వేఁచెడి |
| 33 | 27 | చెలి | చెలియ |
| 34 | 14 | ఒత్తునుదు నా | ఒత్తుదు నా |
| 41 | 18 | కుమారా | కుమారీ |
| 44 | 1 | కొలు | కారు |
| 55 | 12 | అవకుంఠనము | అవగుంఠనము |
| 59 | 27 | పెట్టుదుము | పెట్టుదము |
| 61, 63 | శీర్షిక | పంచమాంకము స్థలము II | ప్రవేశకము |
| 64 | 13 | — | [illegible] (నగ[illegible] జేరిన ప్రముద[illegible]ము) |
| 82 | 2 | తొరఁగు | తొఱఁగు. |

**N.B :**—పఠితల సౌకర్యముకొఱకు కొన్నిచోట్ల సంధి ఉపేక్షింపఁబడినది.



శర్మగారి కృతులు
ప్రకృత ముపలబ్ధములు

## (1) లక్ష్మీశృంగారకుసుమమంజరి

(లక్ష్మీ సాక్షాత్కార హేతువని పఠితలు స్వానుభవము
వెల్లడించుకొనుచున్న స్తవరాజము.) – 0-8-0
(పది అణాబిళ్లలు పంపినఁ జాలును)

## (2) సౌందర్యలహరి

(ఇంతకన్న సుందరముగాఁ దెనిఁగింప నెవ్వరికిని సాధ్యముకాదని
వేటూరు కాటూరు ప్రభృతు లుగ్గడించిన దేవస్తోత్రము.
శ్రీ శంకరులవారి శ్లోకములు, నా పద్యములు, శాక్త
విషయకమైన 70 పుటల సమీక్షయుఁ గలది.) 1-4-0

## (3) దీనచింతామణి

(బిడ్డలు బాలురచే కంఠపాఠము సేయింపఁదగిన ప్రార్థనాపద్యములు.
పెక్కులు కలది.) 0-4-0
(5 అణాబిళ్లలు పంపినఁ జాలును)

## (4) వివేకచూడామణి

(శంకర భగవత్పాదులవారి గ్రంథమునకు అనువాదము
వివేకానందులే యీకృతిని తమరచనలలోఁ బలుమాఱు ఉదాహరించు
కొనుచుండిరనుటచే తత్ప్రశస్తి విదితము. పునర్ముద్రణమగుచున్నది.
600 పద్యములు.) వెల రు. 1—12—0.

ప్రాప్తిస్థానము:—
'సాహిత్యస్థాపక'
దుర్భా సుబ్రహ్మణ్యశర్మ
నెల్లూరు.